# మొగలిరేకులు

(ఖండ కావ్యసంపుటి)

Acc No: 23946

రచన :

డా॥ ఉండేల మాలకొండారెడ్డి

1981

హక్కులు
రచయితవి

వెల
రూ. 10/-

నందనమ్ ప్రచురణలు - 1

ప్రథమ ముద్రణ

అక్టోబరు, 1981

ప్రతులు వేయి

ముద్రణ :

సుదర్శన్ ప్రింటర్స్

హైదరాబాద్

894.813
MAL

ముఖ చిత్రం :

శీలా వీర్రాజు

ప్రతులకు

నందనమ్ ప్రచురణలు

102 B, నందనమ్ అపార్టుమెంట్సు

5-8-42, ఫతేసుల్తాన్ లేను

నాంపల్లి, హైదరాబాదు-1.

ఆంధ్ర ప్రదేశ్.

# ప్రణతులు

నా వృత్తి పదార్థసమ్మేళనమైన వాస్తు, నిర్మాణశాస్త్రం. ప్రవృత్తి, పద+అర్థ సమ్మేళనమైన సాహిత్యం. వృత్తి, ప్రవృత్తుల మధ్య సంఘర్షణ నా జీవితం. మొదటిది భుక్తికోసమైతే, రెండవది రక్తికోసం. లేదా విశ్వశ్రేయస్సు కోసం భుక్తి నుండి విముక్తి లేకుండా రక్తిని విశ్వశ్రేయస్సును ఎలా సాధించడం అన్నది సమస్య.

జీవితంలో ఎన్నో సమస్యలు సంఘర్షణలు ఎదురైనప్పుడు కలిగిన నా మనోభావాలకు రమణీయార్థ ప్రతిపాదక శబ్దరూపం కల్పించాలని ప్రయత్నించాను. ఆ ప్రయత్నమే ఈ ఖండకావ్య సంపుటి "మొగలి రేకులు".

ఇందులోని ఖండకావ్యాలు 1948 లో నేను హైస్కూలులో చదువుతున్నప్పుడు, ఉన్నత విద్యాభ్యాసంకోసం మద్రాసులో గ్రేట్ బ్రిటన్‌లో ఉన్నప్పుడు, ఉద్యోగరీత్యా హైద్రాబాదులో, వరంగల్‌లో ఉన్నప్పుడు ప్రత్యేకంగా కవి సమ్మేళనాల సందర్భంగా వ్రాయబడ్డయి. పెక్కు ఖండకావ్యాలు ఆకాశవాణి ద్వారా ప్రసారమైనయ్. ఎందరో మిత్రులు సాహిత్యాభిమానులు నా రచనల్ని ప్రచురించమని కొన్ని సంవత్సరాలుగా ప్రోత్సహిస్తూనే వున్నారు. కోరికవున్నా తీరిక లేక ఆ పనిచేయలేక పోయాను. ముఖ్యంగా కృతిస్వీకర్త సహజకవి శ్రీ యం. యస్. రెడ్డి గారు నన్ను మొట్టమొదటిసారి 1972 లో కలిసినప్పుడు నా చిన్ననాటి పద్యాలు నాకే విన్పించి వారికి నా కవితయందు వారికి గల అభిమానాన్ని, నా యందుగల సౌహార్దతను వ్యక్తపరిచారు.

నా సర్వతోముఖ వికాసానికి అపరంజిబాట పరచిన నా కవితా శక్తిని నేను మరచిపోరాదని నాకు గుర్తుచేసిన నిజమైన సుహృద్రత్నం శ్రీ యం. యస్. రెడ్డిగారికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

"సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సల్లాప స్సజ్జనై స్సహ".

అన్నారు కదా పెద్దలు. చిరకాల మిత్రులు, నా అభిమాన కవులు శ్రీ గుఱ్ఱం జాషువా, డా॥ దాశరథి, శ్రీ బోయి భీమన్న, డా॥ సి. నారాయణ రెడ్డి మున్నగువారి కించిత్ సాహచర్యంవల్ల, శ్రీ శ్రీ వంటి విప్లవ కవుల రచనల్ని అప్పుడప్పుడు మననం చేయడంవల్ల, నాలోని కవితా స్రవంతి ఇంకిపోకుండ అట్లే నిలిచి ఉందని నా భావన. వారికి నా ప్రణతులు. నా యీ చిన్న కావ్యాన్ని ప్రచురించడం ద్వారా, ఆత్మానందాన్ని పొందడమే కాక లోకంపోకడను నా సొంత ప్రేలెత్తి చూపి విశ్వ శ్రేయస్సుకు ఉడుతా భక్తిని ప్రదర్శించావన్న సంతృప్తిని పొందగలితే నేను ధన్యుణ్ణి.

ఈ కావ్యాన్ని ముద్రించడానికి ఎంతో ప్రోత్సాహం కల్పించిన యువకవి శ్రీ రావికంటి వసునందన్‌కు, ఓర్పుతో నేర్పులో ముద్రించిన సుదర్శన్ ప్రింటర్స్ అధిపతి శ్రీ కె. వెంకటయ్య గారికి, కోరినంతనే ముఖచిత్రం వ్రాసియిచ్చిన శ్రీ శీలా వీర్రాజు గారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

ఉండేల మాలకొండారెడ్డి

# మొగలిరేకుల తోరణాలు

---

కళాప్రపూర్ణ

డాక్టర్ దాశరథి

(ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి)

సురభిళములైన మొగలిరేకులు చురుక్కున గుచ్చుకున్నట్లుంటుంది, ఉండేలదెబ్బ గుండెల్లో తగిలినట్లు ఉంటుంది మా మాలకొండారెడ్డిగారి కవిత చదువుతుంటే. మర్మస్పృక్కులు మాలకొండారెడ్డి కవితలు. ప్రతి పద్య రసోదయం వీరి కవిత్వం. కొండంత యెత్తు పుష్పమాలలు వేస్తే ఆ కిర్మీర కాంతి కన్నుల పండువుగా వుంటుంది. మాలకొండారెడ్డి కవితలు కూడా అంతే. మనోహరంగాను మనిషిని మేల్కొల్పేవిగాను వుంటాయి వీరి కవితలు. రమారమి ముప్పై యేండ్లుగా మాలకొండారెడ్డిగారి కవితా మాధుర్యాన్ని పాఠకలోకంతో పాటు నేనూ చవిచూస్తున్నాను.

నేను ఎన్నటికీ మరిచిపోలేని మాలకొండారెడ్డిగారి కవితలు కొల్లలు. వాటి నన్నిటిని గురించీ వ్రాయడం ఇక్కడ సాధ్యంకాదు. అయినా ఒకటి రెండు ఉదహరించక ఊరుకోలేను.

ఉదాహరణకు "మడివేలు" కవిత తీసుకోండి.

" మాసినట్టి చీర మాటికి బండపై
మోదుచున్న చాకి ముసలి వాడ!
ఉదుకవోయి! జగతి యుగయుగమ్ములనుండి
కుదురుకొన్న మురికి వదిలిపోవ"

పై పద్యంలోని మూడు నాలుగు పంక్తుల్లో ఆచార్య మాలకొండారెడ్డిగారి అసామాన్య ప్రజ్ఞ సాక్షాత్కరిస్తుంది.

ఇదే కవితలో ఒక సీస పద్యం వుంది.

" నీరదావృతమైన నీలాంబరమ్మును
కౌముదీజలముతో కడుగు నెవడు ?"

ఈ సీసంలోని శిల్పం అనల్పం అని అంతా అంగీకరిస్తారు.

ఈ కవీశ్వరుడు సలక్షణమై ఛందోబద్ధమైన పద్య కవిత, హృద్య గద్య కవిత, శ్రవణపేయ గేయ కవిత రచించగల దిట్ట. హాస్య రస భరితమైన కవితతో నేటి సమాజం వీపుమీద ఛళ్లున చరవగల కవి ఈయన:—

ఉదాహరణకు "పైరవి".

" పైన రవి
క్రింద భువి
మధ్యనున్నది పైరవి"

అత్యాధునిక కవితారీతికి దీన్ని ఉదాహరణగా చూపవచ్చు.

" ఇల్లాలి పెదవికి
చప్రాసి పదవికి
ఈనాడు చేయాలి పైరవి "

ఇలాంటిదే మరో కవిత "రూపాయి".

" ఓ రూపాయీ!
నీవులేకుంటే లేదుహాయి
నీచుట్టూ తిరుగుతోంది
భూగోళం పగలురేయి "

" గీతలోనే వుంది
జాతి భవిష్యత్తు;
అందరికెలా తెలుస్తుంది?
అది టీకా కారుని సొత్తు "

అన్నారు కవిగారు.

" చేతిలో సిరులిచ్చే గీత
చెట్టుపై రసమొలికే గీత "

ఇలాగ "గీత" అనే మాటను అనేక అర్థాలలో ఉపయోగిం
ఆ శబ్దంతో ఊడిగం చేయించు కున్నారు కవిగారు.

హృదయాలను కదిలించే మరొకవిత "గడ్డికోసం"

కొడవలి చేత పుచ్చుకుని వచ్చినవానితో గడ్డి అంటుంది: —

" కుతుకలు కోయగలవే కాని మా
బ్రతుకులు కోయగలవా నీవు?
తరిగేకొలది మీదికి
పెరిగే లక్షణం మాది "

పై నాలుగు పంక్తులు మళ్ళిమళ్ళీ చదివి మురిసి పోయాను.

" ఛిన్నోపి రోహతి తరుః
క్షీణోప్యుపచీయతే పునః శ్చంద్రః " జ్ఞాపకం వచ్చింది.

ఈ ఆచార్యుడు వాస్తు శాస్త్రప్రవీణుడేకాదు కవితా వస్తువు సేకరించ డంలో, వస్తుల్లోని బాధను చవిచూడడంలో, మస్తుగా తిన్నవారి మనస్సుల్లో చొరబడి వారి తత్వాన్ని తెలుసుకోవడంలో, విస్తృత పద్య విద్యా ప్రదర్శనలో సమర్థుడని ఈ సంపుటి చదివినతరువాత పాఠకుడు గమనించక మానడు.

ఉన్నత విద్యనభ్యసించి, విదేశ సంచారంచేసి, ఆచార్యుడై, నేడు ఒక కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తూ, తన సహజ కవితాధోరణి మాత్రం మరువలేదు.

తాను పెరిగి పెద్దవాడైన విక్రమ సింహపురినీ మరువలేదు.

" అరణ్యాన వదలబడిన ఆంధ్ర మహాభారతాన్ని
తెనుగు తోటలోన నాటి తీయదనం పాదుచేసి
పిండిన రసమొలుకునట్టి కండ గలుగు చెఱకు గడగ
తీర్చిదిద్ది పోషించిన తిక్కయజ్వ మందిరమిది "

" అరణ్యాన వదలబడిన ఆంధ్ర మహాభారతం " అనడం ఎంత అర్థ వంతంగా ఉందో నేను చెప్పాలా?

ఇంకా ఇలా అంటున్నారు విక్రమ సింహపురిని గూర్చి:—

" పెన్నానది చిగురుటిసుక తిన్నెలపై విహరించే
వన్నెలాడులున్నారిట! కన్నెత్తిన ప్రమాదమట! "

ఇందులోని ప్రతి పదం పాట పాడుతున్నది, ఆడుతున్నది, ముద్దాడుతున్నది. "A perfect writer would make words sing, dance, kiss" అన్నాడొక విమర్శకుడు.

" శక్తిః కవిత్వ బీజంహి "

" మంచెమీద నిలుచున్న వనిత
మాలకొండారెడ్డి కవిత;
మరి ఉండేల నుంచివచ్చి తాకిన రాయి
మన ఉండేల వారి ధ్వని కలిగించే హాయి" అన్నానునేను.

కవిగారు ఈ కవితా సంపుటికి "మొగలిరేకులు "
అని నామకరణం చేయడంలోనూ ఇదే సొగసుంది.
మంచెమీది పిల్ల మనోహరంగావుండడంవల్ల
ఆమె విసరిన వడిసెలలోని శిల
తగిలినపుడు గుండెల్లో విల విల;

మొగలిరేకుల్లోని పరిమళం మనోహరం. దానికి తోడు ఆ రేకుల ముండ్ల రంపాలు చురుక్కున గుచ్చుకుంటాయి.

ఆచార్య డా॥ మాలకొండారెడ్డిగారి కవితలు మొగలిరేకులు. వీరి "నేతాజీ", "వివేకానందుడు" "కాంతి చక్రాలు" మొదలైన ఉత్తమ కవితా సంపుటులకంటే ఈ "మొగలిరేకులు" ఇతోధికంగా రసికజనామోదం పొందగలదని విశ్వసిస్తున్నాను:

" సా కవితా, సా, వనితా
యస్యాః శ్రవణేన దర్శనేనాపి
కవి హృదయం విట హృదయం
సరళం తరళం చ సత్వరం భవతి"

మాల కొండారెడ్డి గారి మహాభాగ్యం ఏమిటంటే—ఈ మొగలి రేకులు అంకితం పొందుతున్నవారు స్వయంగా సత్కవులు శ్రీ మల్లెమాల సుందరరామరెడ్డి గారు. వీరు గొప్ప చిత్ర నిర్మాతలే గాక, తమ చిత్రాలకు అనేక మనోహరమైన గీతాలు రచించిన సినీ కవులే గాక, సలక్షణమైన ఎన్నో కవితలు రచించి అశేష పాఠక జనుల ఆదరాభిమానాలను చూరగొన్నారు.

మల్లెమాల విద్వజ్జన పక్షపాతి.
"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం."

కృతికర్త, కృతిస్వీకర్త కవీశ్వరులు కావడం చాలా అరుదు. ఈ అరుదైన సన్నివేశం ఎంతో ఆనందకరమైనది.

మల్లెమాలకు మొగలి రేకుల కానుక
మాలకొండా రెడ్డి సత్కవి కోరిక !

కృతిస్వీకర్తను, కృతికర్తను హృదయ పూర్వకముగా అంభినందిస్తున్నాను.

గుండెల్ని గుబగుబలాడించే ఉండేల దెబ్బలు, కన్నులకు మిరుమిట్లు గొలిపే కవితాకుసుమ మనోహర మాలల కొండలు, మా ఉండేల మాలకొండారెడ్డిగారి హృద్య గద్య పద్యాలు.

గుబాళింపులతో గుప్పుకునే మొగలిరేకులకు స్వాగతం. ఈ మొగలిరేకులతో కవితాసౌధాంగణంలో తోరణాలు కడదాం. సహృదయ లోకానికి సంబరం చేతాం. భావుకులైన రసికులకు స్వాగతం.

భాగ్యనగరం :
రౌద్రి భాద్రపద శుక్ల పంచమి

# మొగలి రేకుల సువాసన

(కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామిరెడ్డి) నెల్లూరు.

## కవిగరిష్ఠత

సాహిత్యలక్ష్మి పురుడు బోసి ఉగ్గుబోసి ఉండేల మాలకొండా రెడ్డిని బాల కవిని జేసి, ప్రోదిచేసినది, పెద్ద అయిన తర్వాత సౌభాగ్యలక్ష్మి మత్సరం మాని ఇల్లుచేరినది. 14వ ఏట "నేతాజీ" కావ్యం వ్రాయించి యశోలక్ష్మి జీవితాన్ని నడుపుతున్నది. పసితనం నుండి — బడికి పోయినది మొదలు తరగతులలో మేలు బంతిగా ఉత్తీర్ణు డౌతూ వచ్చిన ఉపజ్ఞా శోభితుడు — ఈ ఇంజనీరు. 1946 లోనే నేను, ఈ బాలకవిని, కవికోకిల దువ్వూరు రామిరెడ్డికి వారసుడనగా, మదరాసు చిత్రగుప్త పత్రికాధిపతి ఎస్. జి. ఆచార్య ఈ మాటను అంగీకరించి నా వ్యాసాన్ని తమ పత్రికలో తిరిగి ప్రచురించినాడు.

అనాడే దుర్భా సుబ్రహ్మణ్యశర్మ :—

పలుకు వెలఁది నిన్ను వలచి వచ్చినయట్లు
పగదొఱంగి సిరియు వచ్చుగాక !
బ్రహ్మ యిచ్చుఁగాక పరమాయువును నీకు,
ఎలమి కలిమి యీశుఁడిచ్చుఁగాక !

అని చెప్పిన పద్యం భవిష్య ద్వాణియై ఈ యువకుని భావి భాగ్యోదయ రేఖల కరకు మాయకుండా ఈనాటికి దీపింప జేస్తున్నది. ఇదిమాల కొండయ్యకు మీసకట్టు ఏర్పడని నాటి ముచ్చట.

గిట్టలు తొ్రొక్కబడని పగటి వేల్పు ఏడుగు్రాల దౌడు, మేఘమాలలో సృష్టించిన ఇంద్రధనువు సప్తవర్ణాల వలె, ఈ మిత్రుని గుణ సప్తకం ఒద్దికగా రాణిస్తున్నది; కవితా విలసనము, గృహవాస్తు శాస్త్రము, అధ్యాపక దక్షత, వ్యాపారనైపుణ్యము, వృత్తి విద్యాలయ స్థాపనోద్యోగము, దేశారాధన, మిత్రప్రేమ – ఇవీ ఈయన జీవిత సంగీతానికి మూర్ఛన గూర్చే సప్తస్వరాలు. ఇన్ని మంచి గుణాలతో తలనిండినా తలదిరుగని వినయభూషణుడు – ఈ మధుర కవి.

## కవితా సంపుటి పేరు

ఈ కవితా కదంబం పేరు – మొగలి రేకులట; పేరులో సార్థకత – శిల్పం ఉన్నది. వాడినా వాసన పోనివి మొగలి రేకులు. ఈ రేకుల రెండు అంచులలో రంపపు ముళ్ళవంటి ముళ్ళ వరుసలు ఉన్నవి. ఈ కవి చేసిన ఎగతాళి ఎత్తిపొడుపులే ఆ ముండ్ల పొడుపులు. వాటి అమ్లాన సౌరభమే ఈ కవితలు కలిగించే ఆనందం. మొగలి చెండు రేకుల లోపల కేసరాల గుత్తులున్న పరమున్నది; ఇవి సువాసనల గుబాళించే పచ్చని పుప్పొడి తో నిండి యున్నవి. ఈ పరాగమే ఈ సుమనస్కుని జీవితస్వరూపం. భావుకుడు కాబట్టి ఈ మొగలి రేకులతో చదువుల రాణికి సిగపువ్వు అల్లినాడు.

## కవితానుశీలన

సృష్టిలో సమపాళ్ళుగా ఉన్న మంచి చెడ్డలను సమదృష్టితో చూడ గలిగిన సంస్కారిత హృదయంలో వ్రాసిన రసార్ద్రకవితలు ఇవి. సామాన్య విషయాన్ని గూడ, ఒక సరికొత్త చూపుతో చూచి, క్రొత్త

శయ్యలో చెప్పగలిగిన భావుకత – భాషాపాటవం వీటికున్నవి; రచనా శిల్పం వీటికి ప్రాణం పోసినది. పైపై తళుకుల లోతు, లోపలదాగి ఉన్నవాటి సత్తువను తెలిసి, వాటిని కవిత్వంలో పెట్టగలిగిన నేర్పుతో ఈ కవి కాలగతిని తలపోస్తున్నాడు.

మహామేధావి – సర్. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి కవి పండితులకు గల భేదాన్ని ఇట్లా సూత్రీకరిస్తున్నాడు :– The diffence between a poet and a scholar is this:- The Vocabulary is the same, but the poet takes the Common words and strings them into garlands of eternal Beauty.

ఇట్లే – ఇందలి పదాలన్నీ సామాన్యాలే అయినా వాటి ఏర్పు కూర్పులలో కవితా సౌందర్యం ఒనకూడి ఉన్నది. తెనుగు నుడికారం పులకలెత్తిస్తున్నది. ఇట్టిది భావుకుడైన కవి పనితనం.

మానసికారోగ్యాన్ని తెలిపే ఈ ఆకాంక్షతో పుస్తకం ప్రారంభింపబడుతున్నది :–" ప్రతివదనం స్నేహపూర్ణ పాత్రికయై నవ్వు లొలికి, ప్రతిహృదయం దీప శిఖాప్రభయై ప్రాభవము చూపి భాసించిన ఆనాడే ప్రజావళికి దీపావళి"

నర్సును విశ్వసోదరి అంటూ, ఆమె అకళంక నిష్కామ సేవా తత్పరతను మహిమ పరచి, ఆర్తులకు "జీవితం మీద ఆశ చిగురింపజేసిన వాత్సల్య స్వరూపిణి"గా చిత్రించినాడు. అందువల్లనే "బాధాతురులకు అమృతం పంచి పెట్టు మోహిని" అయిన దంటాడు. పౌరాణిక మోహిని వలె మోసాలెరుగని మానవి గదా ఈ నర్సు?

తెనుగు తల్లి :— తెలంగాణా ఉద్యమంలో "ఒకే సంస్కృతి తీగపై వికసించిన గులాబీని రేకురేకు విడదీయగ రేపెట్టిన వారెవరు" అని ప్రశ్నించి, ఆంధ్ర కీర్తిని చవులూర కొని యాడుతున్నాడు.

రాతియుగం :— ఒక వైచిత్ర్యాన్ని చూపుతున్నది. రాణి కిరీటంగో మెరసే రాళ్ళు – అసలును మించిన లాభాలకు ఆధారమైన తూనిక రాళ్లు – అందాల చంద్రునిలో గూడ అన్నీ కటిక రాళ్ళే" అంటూ, స్థలాంతరం స్థాన భ్రష్టత్వాన్ని బట్టి చేకూరే గుణ అవగుణాలను నవ్య ఫక్కీలో చెపుతున్నాడు.

అశ్రుతర్పణం :— ఇంజనీరు కృష్ణమూర్తి కృష్ణానదిలో ప్రాణార్పణం చేసిన (కట్ట మంచి వారి ముసలమ్మ మరణంలో, ఆమె నిండు చెరువు కోసరం ఆహూతి అయినట్లు) దానికి ఉరలిన కవి కన్నీళ్లు కృష్ణ నీటిని దరులంట జేస్తున్నవి. స్వర్గాన్ని అప్సరసలను మొగలి రేకుల ముళ్ళలో గుచ్చుతున్న విధం చూడండి; ముళ్ళపోటు గాదు – ఉండేలు – వింటితో దబ్బరాళ్లు రువ్వడం :— "పనీపాట లేని పాత స్వర్గంలో పచారు చేస్తూ బ్రదుక గలవానీవు? శ్రమజీవులలో శ్రమజీవిగా సంచరించిన నీవు, సురాపానంతో సోలుతూ శృంగార భంగిమల నభినయించే అప్సరాంగనల మధ్య ఆడగలవా ?"

విక్రమ సింహపురం:— ఇందు స్వస్థలాభిమానం చూపుతూ "రసమొలుకునట్టి కండగలుగు చెఱకు గడగా భారతాన్ని తీర్చిదిద్దిన తిక్కయజ్వ మందిర మిది" అని ఆ భవ్య కవితావేశుని ఈ కవిగూడ

ఆవేశంతోనే ఆర్పిస్తున్నాడు. భారతంలో పర్వం అంటే చెరుకు గడ గణుపు అని అర్థం; ఈ మాట మీద కవి మంచి చమత్కారం చేసినాడు.

మడివేలు :– మురికి గుడ్డలను శుభ్రంచేసే చాకలి సాంఘిక సేవలను కొనియాడుతూ, వ్యాజోక్తి అవహేళనలతో కంపు బట్టిన లోక వృత్తాన్ని ఉతికి వేస్తున్నాడు. కవి సమదర్శనుడై ఉత్కృష్ట నికృష్టాలను గుర్తిస్తున్నాడు. ఇందలి సీస పద్యాలు లిరికల్ ఎలిమెంటులో ఇంపుగొలుపుతున్నవి. చాకిరేవు బండను పైకి ఎత్తిపెట్టి "ప్రత్యహమ్ము మైలపడు నేటి మా వేషములను చెవులుబట్టి మురికి వదలగొట్టు" మని లోకహితాన్ని గోరుతున్నాడు.

కృష్ణవేణికి మానవీ కరణం చేకూర్చి ఆంధ్రజాతి జాగృతి యశము పాడుమంటున్నారు. ఇది నవ్యభావారోపణంతో ఇంపుగా ఉన్నది. కృష్ణమ్మ మహారాష్ట్రుల ఇంట బుట్టి ఆంధ్రుల ఇంట మెట్టినదని భావ విస్ఫులింగాల వెదలగొట్టుతున్నాడు.

పైరవి :– ఘాటైన ఎత్తిపొడుపు పైరవి అంటే పైళ్ళ వెంట తిరగడం. సుమతి శతకంలో చెప్పిన "ఇరుసున కందెన బెట్టడం" లంచగొండెతనం విశ్వరూపం దాల్చడం," పైరవి సర్వాంతర్యామి కామరూపిణి"గా, వింత సోయగంలో చెప్పినాడు.

దొంగలున్నారు జాగ్రత్త అన్న నోటీసు బోర్డులు మన జాతి అవినీతి తాండవాన్ని ప్రపంచానికి చూపడమే నని సిగ్గు లేకుండా ఈ వ్రాతను "మన జీవనగీతం" చేసుకొన్నామని కుమిలే ఎదతో వాపోతున్నాడు.

గడ్డిచెప్పిన మాటలు:- సృష్టిలో ప్రతి వస్తువుకూ ఒక విలువ ఒక ప్రయోజనం ఉన్నదంటూ, ఒళ్ళు దెలియని మానవాళిని బాదుతున్నాడు. కవిత్వం తేనె పాకంలో బడినది. "కుతుకలు కోయగలవే గాని, మా బ్రతుకులు కోయగలవా?" అని, చేలో గడ్డి గనిమ మీద మనిషిని అడుగుతున్నది. మాకు ఒక మంచి చాటవ ఉన్నది — పెరికి పెరికి తిన్న గాడిద చచ్చిందేగాని గరిక చావులేదు — అని.

మాలకొండా రెడ్డిని ఒళ్లు మరచి పొగడి రాగదూరులచేత చీవాట్లు తింటానేమో అనిపిస్తున్నది. అయినా గుణాన్ని పొగడక తప్పుతుందా? ఇంకా చెపితే ఎక్కువ తీపుదిని మొగం మొత్తించు కొన్నట్లవుతుంది. కొదవమీరే చదువండి.

మామూలు మాటలకు ప్రాణం పోసి సౌందర్య మాలికలుగా కవి కూర్చిన పదబంధాలను — కొనరుగా కొన్నిటిని వినండి:— కరువు బరువుతోడ క్రుంగి; కడుపు తీపి చూపింపగ కన్నబిడ్డ లెవరు నీకు; తళతళమను మల్లెపూల వెలివెన్నెల దుస్తులు; తెనుగుతల్లి - బ్రతికి చెడ్డ నీకుట్టలు తమ నెత్తురు ఏత మెత్తి త్యాగఫలం గంపకెత్తి; ఆమెగుండెలో దాచిన అమృతమయ స్తన్యధార: కృష్ణవేణి — నిల్గడ వహించి తెలుగుతల్లిముంగిట నిల్చి ముత్యాల తుంపురుల ముగ్గులు పచరించి; వరి వెన్నుల పసిడి నగలు ధరిస్తుంది ధరారమణి; అరణ్యాన వదల బడిన ఆంధ్ర భారతాన్ని తెనుగుతోటలోన నాటి తీయదనం పాదుచేసి (అరణ్యాన వదలటం మంచిశ్లేష); వీర రక్తకాసారంలో విజయపద్మం మొలచిన రోజు; ఏలంచ గొండెదో ఈ రహస్యపు జేబు, హేమసౌరభముల నీను చుండె; (మడివేలు) వలువలకు విల్వహెచ్చునీ చలువ వలన, అట్టి నీచేతి చలువ మహత్త్వ మెఱుగు (చలువపై చమత్కారం); జనపదాలు

మునిగినవి, ఘనశిల్పాలు తేలినవి; అలల చేతులెత్తి పిలుస్తున్నాడు, ఆరాటపడుతున్నాడు నీ ప్రియుడు (కృష్ణవేణి-సముద్రుడు); అమాయిక ప్రజల బ్రతుకమ్మ పాటకు అంతులేని పల్లవి — పైరవి; విప్లవ క్రవులేమైనారు? కత్తులు పట్టే సత్తువలేక ఉత్తకేక లేస్తున్నారు. కర్షకుని నాగేటి గీత కలదు సుమా అందు నీ సౌభాగ్యసీత (సీతమ్మ పుట్టిన నాగేటి చాలు); తొలకరి వానజల్లుల తడిసి పులకించి మేల్కాన్న భూమాత మేని పులకలు మేము గడ్డి (తమిళ కవి కంబని భావన వంటిది); నవ నాగరకత చాటున నడుస్తున్న నాటకం; కాటుక పులిమినట్లు కారుచీకటి ముసిరినవేళ ఇట్లాటివి ఎన్నో ఉన్నవి.

సరేనయ్యా! ఛందోబద్ధమైన కమ్మటి కవిత్వం వ్రాసే ఉండేలుకు నేటి కారగ్గవ గీతాలెందుకో ; ఇదొక ఫ్యాషనా!

## ఈ మొగలిరేకులు వెదజల్లిన రెడ్డి జీవితపు పుప్పొడి

— ఇనిమెర్లలో (కనిగిరి తాలూకా, ప్రకాశంజిల్లా) 1932 లో జనన మందినాడు.

— వీధి బడిలో (ఇనిమెర్ల) చదివే టప్పుడే — ఐదోక్లాసు లోనే కవిత్వపు బుగ్గపుట్టినది.

— 1942 లో నెల్లూరు పంటల అల్లూరు వచ్చి సాహిత్య రసికులు — అల్లంపాటి రమణారెడ్డి, కాటంరెడ్డిరమణారెడ్డి గార్ల అండన జీవిత లత ననవేసి పూచినది. అక్కడ రామకృష్ణ ఉన్నత పాఠశాల

అధ్యాత్మిక దేశారాధన వాసనల అలవరచి వివేకానంద స్వామి పాద పద్మాలకు మ్రొక్కు లిడ జేసినది.

బుద్ధిపుండరీకం విప్పారినది!

— 1949 – ఎస్. ఎస్. ఎల్. సి. పబ్లిక్ పరీక్షలో 600 మార్కులకు 508 సంపాదించి, సంయుక్త మదరాసు రాష్ట్రంలో ఆ క్లాసులో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు.

— 1946 లో "నేతాజీ" పద్యకావ్యం వ్రాసినాడు. కవితా శాలి క్షేత్రంలో ఇది మొదటి కారు పంట – అయినా పొల్లుగింజలు లేని నిండు పంట! 14.వ ఏటనే రెడ్డి జీవిత వల్లరి పూచిన ఈ సురభిళ సుమాన్ని నెల్లూరు ఆంధ్రసభవారు ఆఘ్రాణించి సమ్మానించినారు.

— 1949–51, నెల్లూరులో వెంకటగిరిరాజా గారి కాలేజిలో ఇంటర్ చదువు.

— 1953 – 21వ ఏట – ఆధ్యాత్మిక జ్యోతి–"వివేకానందుడు" అనే పద్యకావ్యరచన, రచనకు సన్మానాలు; శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారల ప్రశంసలు. ఈ కావ్యం చదువుల రాణికి ముంజేతి చిలుక.

— 1956 – వివేకానందుడు – మదరాసు విశ్వవిద్యాలయంలో పాఠ్యగ్రంథమైనది. కవితాలక్ష్మి ధనలక్ష్మిని ప్రసాదించినది.

— దేశసేవారాధన; యువకాంగ్రెసు కార్యదర్శి నాయకత్వము.

— 1951 – 55 మదరాసు గిండీ ఇంజనీరింగు కాలేజిలో చదువు.

— 1955 - 57 పి. డబ్ల్యు. శాఖలో ఉద్యోగం ఈ సాహిత్య రసికునికి (భైరవి గీతం వ్రాసిన) ఉద్యోగం గిట్టుతుందా?

— 1957 - 61 ఉస్మానియా యూనివర్సిటీలో అధ్యాపకుడుగా భాగ్యనగర్ చేరినాడు.

— శ్రీమతి సరస్వతిని (నెల్లూరు ఆనం పద్మనాభరెడ్డి పుత్రిక) గృహలక్ష్మిగా చేపట్టి త్యాగయ్య చెప్పిన మహారాజై; ఆ ఇల్లాలు నోముల పంటగా 1. డా॥ జయశ్రీ 2. డా॥ రాజ్యశ్రీ 3. కు॥ ఉషశ్రీ 4. కు॥ సంధ్యశ్రీ నామధేయలైన పుత్రికలను బడసి సంసార సుఖం అనుభవిస్తున్నాడు.

— 1959 లో ఖండకావ్య సంపుటి - "కాంతి చక్రాలు" ప్రచురణ.

— 1961 - 1979 - వరంగల్ ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాలలో ఆచార్యుడుగా శిష్యకోటికి ప్రీతిని గూర్చినాడు.

— 1961 వరంగల్లులో సిద్ధార్థ నగరుకు గడ్డ ఎత్తి తన గృహ నిర్మాణ కౌశలానికి ఏరువాక సాగించినారు - (రైతుబిడ్డ గదా!)

— 1974 - 77 హైదరాబాదులో సరసమిత్రుడు, సుప్రసిద్ధ న్యాయవాది - పర్వతరెడ్డి బాబుల్‌రెడ్డితో కలసి సిద్ధార్థ హోటల్ నిర్మాణము, నాంపల్లిలో "నందనం" అనే ఒక పెద్ద ఇండ్లలోగిలిలో శత గృహ నిర్మాణంచేసి, సుఖావాసాలు కల్పించి గృహస్థుల ఆనందింపజేస్తున్నాడు.

— 1965 - 68 - ప్రత్యేక ఉన్నత విద్యకు ఇంగ్లాండు చేరి ఆ సీమ చదువులో Structural Engineering శాఖలో డాక్టరేట్ (పి. హెచ్. డి.) పట్టం పొందినాడు. దీనితో విద్యా సముపార్జనా పాత్ర నిండి పొర్లి పారినది.

— 1979-హైదరాబాదులో "చైతన్యభారతి" అనే ఇంజనీరింగు అధ్యయన సంస్థను స్థాపించి, దానికి ప్రిన్సిపాలై సిద్ధిగల ప్రసిద్ధికి వచ్చినాడు. తాను నేర్చిన విద్య విద్యార్థులకు పంచిపెట్టుతూ, విద్యాదాత అయినాడు. ఈ సంస్థకు అధ్యక్షుడు - న్యాయమూర్తి - కొండా మాధవరెడ్డి గారు.

వ్రాతకాడు :- గ్రంథరచన మాలకొండారెడ్డి నెత్తురులోనే పారుచున్నది. వ్రాయను అలవాటు పడిన చేయి ఊరుకుంటుందా? సవ్యసాచిగా వ్రాసి ప్రచురించిన గ్రంథాలు - వ్యాసాలు:- ఇంజనీరింగు విషయికమైనవి 32 - జాతీయ అంతర్జాతీయ పత్రికలో వెలువడినవి. "చౌక ఇండ్లు కట్టుట" అనేది ప్రత్యేక విషయ గ్రంథము. ఆకాశవాణి ప్రసంగాలు చాలాగలవు.

— 1981 రెడ్డి కవితాలత పూచిన సరికొత్త పూవు ఈ "మొగలి రేకులు" ఇంకా ఎన్నో వసంతాలు ముందున్నవి. కాలకీలితంగా పూస్తుండగలవు ఈ తీగ ఎగబ్రాకుచునే ఉండును గాక.

శుభం

# ముఖ చూపు

అంటేముఖచూడడం. అలాముక్కుతో చూస్తే ఈ మొగలిరేకుల్లో సువాసనా ఘాటూ రెండూ కనిపిస్తాయి. అందుకే ఈ కవితాగుచ్ఛానికి రచయిత పెట్టినపేరు సార్థకం.

ఇందులోని గీతాలన్నీ భావకవితాయుగానికీ, అభ్యుదయ కవితా యుగానికీ నడుమసాగిన సంధిసమయంలోనివి. అందుకే వీటిలో భావ కవిత్వపు సువాసనా, అభ్యుదయ రచనల ఘాటూ ఆస్వాద్య మవు తున్నాయి. ఆ విధంగా కూడా దీనిపేరు సముచితంగా ఉంది.

కేవలం సువాసనను తీసుకుంటే నీరసమే మిగులుతుంది. ఘాటును మాత్రమే స్వీకరిస్తే ఉక్కిరి బిక్కిరై పోతాం. రెండింటినీ సమానంగానే సమాదరించాలి.

భావకవిత్వంలో లేని సామాజిక స్పృహ అభ్యుదయ కవిత్వంలో లభ్యమవుతుంది. రచయితలో ఉన్న సామాజిక చైతన్యాన్ని నేనభినంది స్తున్నాను.

ఇందులోని ఎన్నెన్నో గీతాలలో వ్యంగ్యవైభవం గోచరిస్తుంది. ఆ వైభవమే కవిత్వానికి జీవితానికి ప్రాణం.

"కవిత్వం అంటే ఏమిటి?" అని ప్రశ్నిస్తే "ఏమిటి" అనే ప్రశ్నే జవాబుగా మిగులుతుంది. కవిత్వాన్ని ఎంతోమంది ఎన్నో విధాల నిర్వచించారు. నామట్టుకు చెళ్లపిళ్లవారి నిర్వచనం బాగానచ్చింది.

"జ్ఞాపకం ఉండేది కవిత్వం, మరిచిపోయేది చెత్త "అన్నాడాయన. ఇందులో ఎన్నో గీతాలు పఠితలలో శాశ్వతముద్ర వేసుకొంటాయనడానికి నాకు సందేహంలేదు.

దీనికి కృతిభర్త యం. ఎస్. రెడ్డిగారు నాకు చిరకాలంనుంచీ ఆత్మీయ మిత్రుడు "మల్లెమాల"గా సహజకవి. కవిగా లబ్ధప్రతిష్ఠుడు.

ఈ దాంపత్యం మూడుపువ్వులు ఆరుకాయలుగా ఘాటైన సువాసనలు వెదజల్ల గలదని నేను వేరేచెప్పనక్కరలేదు.

చికాగో
24-5-81

—శ్రీ శ్రీ

## మల్లెమాలకు స్వాగతం–

"మొగలిరేకుల" తోరణమ్ములు
సొగసుగా మెయినింపుకొని నా
మనసుముంగిలి యిదిగొ నీకయి
మల్లెమాలా ! ఎదురుచూచెను
కదలిరమ్మిక పరిమళమ్ములు
పదపదమ్మున పొదలగా
విందువై రసబంధువై యిట
విడిదిసేయుము తిరముగా.

నీవెక్కడ వెలసితివో
నేనెక్కడ మొలచితినో
ఇరువుర ముడివేసెనయ్యా
సరస సాహితీబంధం
మొగలిరేకులందు నిలిచి
ఎగసిపోని గంధం.

పలుకులోనగలదు సెలయేటి గలగల
మనసులోనగలదు మల్లెమాల
సిగనుగలదు నేడు "మొగలిరేకుల" చెండు
అందమంతనీదె సుందరన్న !

ఉండేల—
కృతికర్త

ఉండేలకు

రెండేమాటలు—

ముద్దులొలుకు బుల్లి మొగలిరేకులతోడ
నిత్యనూతనముగ నిలుచురీతి
చెలిమికలిమి నడుమ సేతువు నిర్మించి
మంచిపెంచి మమతపంచినావు—
అంతియేకాక ప్రతిఫల మడుగకుండ
కట్టడము మీద పదిమంది కనులుపడెడు
తోరణద్వార తీరాన పేరుచెక్కి
యెల్లచనవులు నాముందు చల్లినావు—
ఇంతచేసినందుకేమీయ గలవాడ
మంచిమరచిపోని మనసుదక్క
ఇచ్చినాడ దానినేనాడొ గుదిగ్రుచ్చి
తిరిగి అడుగనట్టి షరతుమీద—
కనుకను చిఱుకానుకగా
అణువణువున వెల్లివెరియు ఆనందముతో
వినయాంజలి ఘటియించెద
కొనుమా "ఉండేల మాలకొండారెడ్డీ !!—

మల్లెమాల—
కృతిస్వీకర్త

## విషయసూచిక

# నే కోరే దీపావళి

ఇది కాదోయ్! ఇది కాదోయ్!
నే కోరే దీపావళి!!

నాడెపుడో గోపాలుడు
నరకుని పరిమార్చెనంట!
వీరనారి సత్యభామ
విల్లమ్ములు పట్టెనంట!
చీకటి లోకాన. వెల్గు
రేఖలు ప్రసరించెనంట!!

నరకుడు మరణించెనా?
నరకం నశియించెనా?
నిజంగా నరలోకం
విజయం సాధించెనా?
అయితే ఏమిటి యీ
అంధకార మేఘావళి!!

ఎటు చూచిన నరకాసుర
పటుభీకర నటనాలే!

2

కదలలేని మానవులే !
ఎందులకీ వినోదాలు
ఇంటింటా ప్రమాదాలు !!

మనసులోని చీకట్లను
మాయించే చిచ్చుబుడ్లు
తరతరాల దారిద్ర్యం
తరిమివేయు టపాసాలు
జగమంతా మార్మోగిన
సమయమె నా దీపావళి
భామలెల్ల వీర సత్య
భామలుగా విక్రమించి
ఇంటిలోని నరకాలను
గెంటినపుడె దీపావళి !!

ప్రతి వదనం స్నేహపూర్ణ
పాత్రికయై నవ్వులొలికి,
ప్రతి హృదయం దీపశిఖా
ప్రభయై ప్రాభవము చూపి
భాసించిన ఆనాడే
ప్రజావళికి దీపావళి !!



# విశ్వ సహోదరి

అనుక్షణం వేదనలో
అనారోగ్య యాతనలో
మూల్గుతున్న వైద్యశాల
మురిసిపోయి మైమఱవగ
దరహాసము రువ్వెదవే !
తరుణీ ! నీ వెవ్వతెవే !

ప్రేమ చూపి పరిచరింప
ప్రియుడెవ్వడు నీకిక్కడ ?
కడుపు తీపి చూపింపగ
కన్నబిడ్డ లెవరు నీకు ?
అనురాగం బొలకబోయ
అన్నదమ్ములసలె లేరు.
అవ్యాజ ప్రేమతోడ
అఖిల జనుల సేవింతువు
ఓ విశ్వసహోదరీ !
ఓ ప్రేమ సుధాఝరీ !

పాలకేడ్చు పసికూనకు
జోలపాడు తల్లివై
ఆర్తినున్న ప్రియనాథుని

ఆదరించు సాధ్వివై
ముసలి తండ్రి పరిచర్యకు
విసుగు కొసని బిడ్డవై
ప్రతియింటను గోచరించు
వాత్సల్య స్వరూపిణీ !

ఇతడు కుష్ఠరోగి సుమా
చీమును నెత్తురు కారెడు
జీవమున్న కళేబరము
ఈగలు సైతము వీనిని
ఏవగించుకొని పోవును
దగ్గుకు బొక్కెడు రక్తం
క్రక్కెడు క్షయరోగి అతడు
అతని గాలి సోకునంచు
అప్తులె దరి జేరరారు
పుట్ట కురుపుతో ఎపుడో
గిట్టెడు నిర్భాగ్యు డితడు
విషజ్వరపు కోరలతో
విలవిల తన్నుకొను నతడు

ఎటు చూచిన మృత్యుకేళి
ఎటు విన్నను ఆర్తరవము
నరక ప్రతిరూపమనగ

౨

నడచెడు వైద్యాలయమును
చల్లని నీ చిరునవ్వున
స్వర్గముగా మార్చితివే.

కాయమెల్ల గండ్లు చేయు
కఱకు సూదిపోట్లు సైచి
కాలకూట విషము బోలు
కటిక చేదు మందు త్రావి
బ్రతుకు బాట చివరిదాక
పయనించిన బాటసారిని
ఆదరించి చేరదీసి
జీవితమ్ము మీది ఆశ
చిగురింపగ జేయునట్టి
నీ మృదుహస్త స్పర్శకు
నీ మాతృ ప్రేమ సుధకు
ఏది సాటి వచ్చునే!
ఎవడు విలువ కట్టునే!

ఓ యువ పరిచారిణీ!
ఓ నిత్య సుహాసినీ!
మానవ సేవా పునీత
మహిత దివ్యజీవనీ!

పగలు రేయి పోరుపెట్టు
పసిబిడ్డను విసుగుకొనవు
కన్నతల్లియైన గూడ
కసిరికొట్టు కోపముతో
తనని బిడ్డలందింతటి
కనికరమది యేలనే?

ఒక్కనాటి సుఖమునకై
ఒక్కయేటి దుఃఖమ్మున
పొరలుచున్న పురుషుడొకడు
అతిగ మెక్కి జీర్ణింపక
ఆయాసము జెందునొకడు
జీవితమ్ము మీద రోసి
చావ సిద్ధమయ్యె నొకడు
ప్రమాదాన కాలు విరిగి
పలవించెడు దీనుడొకడు
సమబుద్ధిని సర్వజనుల
సరసజేరి కొల్చెదవే!!

తుంటరి యువకుడు నీపై
కొంటెచూపు విసరుగాక
అసూయతో స్వార్థజగతి
అపనిందలు వేయుగాక

/

చలియింపక వెనుదిరుగక
సాగిపొమ్ము నీ స్త్రీవను
“ నైటింగేల్ ” కన్యామణి
నడచిన నీ దివ్యపథం
మానవులకు పూజ్యతమం
మహౌదార్య సంభరితం ! ! !

గాయపడ్డ హంస నెత్తి
కట్టుకట్టు గౌతముడూ,
నేలబడ్డ జింకపిల్ల
లాలించెడు భరత మౌని
పుడమి మీద నీరూపున
పునర్జన్మమెత్తి రేమొ !

తళ తళ మను మల్లెపూల
వెలివెన్నెల దుస్తులతో
అడుగడుగున ప్రాణభయం
తుడిచి వేయు నడకలతో,
అంచరాణివోలె నీవు
అల్లనల్ల కదలిరాగ
చంద్రరేఖ వోలెనీవు
చల్లచల్ల సాగిరాగ
కలనిలోని క్షతగాత్రుల

/

చలియించక వెనుదిరుగక
సాగిపొమ్మ నీ త్రోవను
"నైటింగేల్" కన్యామణి
నడచిన నీ దివ్యపథం
మానవులకు పూజ్యతమం
మహౌదార్య సంభరితం ! ! !

గాయపడ్డ హంస నెత్తి
కట్టుకట్టు గౌతముడూ,
నేలబడ్డ జింకపిల్ల
లాలించెడు భరత మౌని
పుడమి మీద నీరూపున
పునర్జన్మమెత్తి రేమొ !

తళ తళ మను మల్లెపూల
వెలివెన్నెల దుస్తులతో
అడుగడుగున ప్రాణభయం
తుడిచి వేయు నడకలతో,
అంచరాణివోలె నీవు
అల్లనల్ల కదలిరాగ
చంద్రరేఖ వోలెనీవు
చల్లచల్ల సాగిరాగ
కలనిలోని క్షతగాత్రుల

కరణినున్న రోగార్తులు
కొలనులోని కలువలట్లు
కలకల వికసించిరే!

ఓ నవీన వైద్యాలయ
సరోమరాళ భామినీ!
ఓ రుజార్త హృత్కువలయ
శరత్కాల విభావరీ!
బాధాతురులకు అమృతము
పంచిపెట్టు మోహినీ!!!!!



# తెలుగు తల్లి

(తెలంగాణా ఆందోళన సందర్భంలో ఆంధ్రప్రభ
(22-6-1969) లో ప్రకటించినది)

ఏం చేస్తున్నావమ్మా !
ఎక్కడున్నావమ్మా !

కడుపున పుట్టిన బిడ్డలు
కలిసిమెలసి ఉంటారని
ఢిల్లీ కోట జయించి
ఎల్ల రాజ్యమేలు తారని
కలిమి బలిమి పండిస్తారని
కలలు కన్నావు కదూ !

అన్నదమ్ముల తీరు పోయి
అసలు మానవతే పోయి
అనరాని మాటలంటుంటే
వినలేక వింటున్నావా !

"అజంతా" చిత్రాలు వ్రాసిన చేతులు
హైదరాబాదు గోడల మీద
"ఖజురహో" చిత్రాలు వేస్తే
చూడలేక చూస్తున్నావా ?

## 10

ప్రతాపరుద్రుణ్ణి తురకలు
పట్టుక పోయిన నాడే
చెట్టుకొకరు పుట్టకొకరై
చెదరిపోయిన నీ బిడ్డలు
పరపంచల శతాబ్దాలు
బ్రతికి చెడ్డ నీ కుఱ్ఱలు
తమ నెత్తురు ఏతమెత్తి
త్యాగఫలం గంపకెత్తి
అందరూ ఒకటై వచ్చి
అందాల "భాగ్యనగరం" చొచ్చి
ఇంతా పదమూడేండ్లే !
ఇంతలోనే "ముసలం"
ఎందుకు పుట్టిందా అని
అంతులేని శోకంలో
అలమటించి పోతున్నావా ?
అమ్మా ! నిజంగా ఇది
తమ్ముడికి పుట్టిన బుద్ధేనా ?
అతణ్ణి ఆవరించి యున్న
అలవికాని సైతానులదా ?

"నిజాం" నిరంకుశ పాలనలో
"రజాకార" హత్యాకాండలో

గిజగిజలాడిన తెలంగాణా తమ్ముడు
విజయవాడ చేరిన నాడు
ఆదరించిన అన్నలనేనా
చీదరించి పొమ్మంటున్నాడు ?

తమ్మునింట అన్న పెత్తనమా !
కమ్మగా ఉందని మెక్కడమా !
వేయిపాటు ఒకచే తప్ప
వేయిబాట లేదంటాడా ?
నాగార్జున సాగరాన్ని
నడిమికి చీల్చమంటాడా ?
చీడ పురుగు పట్టిందని
చెట్టునే నరక మంటాడా ?
ఆవేశంలో ఉన్నాడు తమ్ముడు
ఆహారం మానినాడు కుఱ్ఱడు
ఒడి జేర్చి బుజ్జగించి
ఓదార్చుటే మార్గమమ్మా !

ఒకే సంస్కృతి తీగపై
వికసించిన గులాబీని
రేకు రేకు విడదీయాలని
రేపెట్టిన వారెవ్వరు ?

ఒకే గొంతుతో తేనెలు
ఒలికించే తెగులు పాటకు
అపశ్రుతులు కల్పించే
అసూయా పరులెవ్వరు ?

"చార్మినార్" పై వెలిసిన
తెలుగుల తేనియ పట్టుకు
చిచ్చుపెట్టి దాగుకొనే
శిశు హంతకు లెవ్వరు ?

నీ తనయులు కారమ్మా !
నిజమని తెలిసికోవమ్మా !
నీ రక్తం పంచుకొన్న
నీ ఊపిరి పీల్చుతున్న
నిక్కమైన తెలుగు వీరు లీ
నీచ కార్యం చేయరమ్మా !

కాకతీయుల కోటలో
ఏకశిల ఆలాగే ఉంది
బమ్మెర పోతన భాగవతంలో
కమ్మదనమేమీ తగ్గలేదు
హంపీ నగర శిధిలాలు
"అల్లసాని" కవితారీతులు

ఆంధ్రుల గత చరిత్రకు
అనవాళ్ళుగా నిల్చే ఉన్నయ్.

నన్నయ అక్షర రమ్యత
తిక్కన కవితా శిల్పం
చిన్నయ్య మిత్రలాభం
మన్నులో కలిసి పోలేదు.

గౌతమీ కృష్ణా పినాకినులు
గతులు తప్పి నడవలేదు
క్షణకాలపు పొంగులే
సహజన్ముల విడదీశాయి

పేరు పెట్టినీ కన్నల్ని
పిలువమ్మా ఒక్కసారి
నీ చల్లని ఒడిలోపల
నిలుస్తారు బుద్ధిమారి.



# అమ్మ ఏం చేసున్నది ?

(ప్రత్యేకాంధ్ర ఆందోళన సందర్భమున ఆంధ్రప్రభలో
(నవంబరు 1972) ప్రకటించినది)

అమ్మ ఏం చేస్తున్నది !
తెలుగమ్మ ఏం చేస్తున్నది !

ఈడొచ్చిన కొడుకులు
ఇంటికి పెత్తందారులు
పంట చేని కాడ
పాడి ఆవు కాడ
వాటాలు కుదరక
ఒండొరుల నమ్మక
పంట తగలేస్తుంటే
పాలొలక బోస్తుంటే
వారించే శక్తి లేక
వల వల యేడుస్తున్నది ! !

"చార్మినార్" పై వెలసిన
తెలుగుల తేనియ పట్టుకు
చిచ్చుపెట్టి స్వార్థపరులు
శిశుహత్యలు చేస్తుంటే

15

మధువు చింది మూసీనది
మలిన జలం పాలైతే
కండ్లుండియు చూడలేని
కబోదియై నిల్చున్నది!!!

ఎడమగట్టు కుడిగట్టని
ఎదలో భేదం చూపక
కొంగు తగిలిన మేరకు
బంగారం మొలిపిస్తూ
పయనించే కృష్ణమ్మ
పలనాటిలో మంటలు చూచి
బండతో తల కొట్టుకున్నది
కొండచుట్టూ తిరుగుతున్నది
ఆమె గుండెలో దాచిన
అమృత మయ స్తన్య ధార
అనుగు బిడ్డలకు దక్కే
అదృష్టం కలదా అని
ఆవేదన పడుతోంది!!!

తండ్రి మాటకై రాజ్యం
త్యాగం చేసిన రాముడు
అన్నకొఱకు అన్ని వదలి

అనుసరించిన లక్ష్మణుడు
విహరించిన తన తీరంలో
పదవులకై సహజన్మల
ప్రతి దిన యుద్ధాలా అని
వింతగా చూస్తున్నది
వెల్లువల గోదావరి ! ! !

"పాలవంచ"లలో విద్యుత్
కీలా సుందరి ముందర
వాలి సుగ్రీవుల వలె
వాలం త్రిప్పే వీరులపై
బాణమెక్కు పెట్టినాడు
భద్రాచల రామయ్య
పక్కుమని నవ్వినాడు
ప్రక్కనున్న లక్ష్మయ్య ! ! !



3)

# ఆంధ్రకేసరీ! స్వాగతంబు


రచయిత:

వి. మాలకొండారెడ్డి

(ప్రధాన కార్యదర్శి)


౧

ధిక్కారంబుసహింపఁజాలనని యుద్రేకంబుతో గుండెపై
చొక్కాదీసి, తుపాకిగుండ్ల కెరగాఁజూపించి, పోలీసులే
యుక్కిర్బిక్కిరిగాఁగ గర్జిలిన నీ యుద్దండతాస్ఫూర్తియే
దిక్కై వెల్గెడి నాంధ్రపౌరుషము పృథ్విన్ ఆంధ్రకంఠీరవా!

౨

తెలుఁగున్ గడ్డకుఁబేరునిల్పిన సమిద్ధీరుండ. నన్ గద్దెపై
నిలుపంజాలకపోయిరే యనుచుఁ జింతింపన్ బనేమయ్యా! యీ
యిల, సామాన్యులకున్ లభింపని ప్రజాహృత్సింహపీఠంబుపైఁ
గొలువుందీరితివంతెచాలు నలుదిక్కుల్ మ్రొక్కులర్పింపఁగన్.

౩

మదమున్ బట్టిన యీనిజాము జులుమున్ మక్కాకుఁబంపించి, త
త్పదఘాతంబులఁజూర్ణమయ్యెడు జనాభానెల్లరక్షించి, భూ
విదితంబైన స్వరాష్ట్రవాంఛకు ఫలాప్తిన్గూర్చి, పాలించుకోఁ
గదవయ్యా! తెలఁగాణతోడ మనమాగాణంబు నాణెంబుగన్.

౪

మను "జమీందారి" ఖాండవవనముఁ గాల్ప
నీవుపదునిడ్డ శస్త్రాస్త్రనిచయమెల్ల
దస్త్రరపు టంపపొదులందు పస్తులుండి
నవయుచున్నది సంధించు నరుఁడు లేక !
అద్భుతగుల మహేంద్రుల నడ్డగించి
పన్నుఖారానఁగుమిలెడి సన్నరైతు
కడుపుచిచ్చుకు సంతృప్తినిడెడివాఁడు
ఆంధ్రఫల్గున ! వేఁటొక్కఁడవనిలేఁడె ?

౫

భరతజనయిత్రి నినుఁగన్న పరమసాధ్వి !
అనుఁగుఁదమ్ములు ముక్కోటి తెనుఁగువారు
జగమెఱింగిన బ్రహ్మతేజస్వివీవు
స్వాగతం బాంధ్రకేసరీ ! స్వాగతంబు.

ఇట్లు,
విద్యార్థి కాంగ్రెస్,
ఆల్లూరు,
నెల్లూరు జిల్లా
1948.

# రాతియుగం

రాతియుగం పోయిందట
రాకెట్ యుగం వచ్చిందట
చరిత్రకారులు చెపితే
ధరిత్రి జనులు నమ్మాలట !

గుళ్లు గోపురాలు రాళ్లు
గుడిపై శిల్పాలు రాళ్లు
గుడిలోపల వేంచేసిన
గొప్పదేవుళ్లు రాళ్లు॥

షా జహాను నిర్మించిన
తాజమహల్ చలువరాళ్లు
హిమాలయం మంచురాళ్లు
ఇలాతలం పసిడిరాళ్ళు

విద్యార్థులు బస్సులపై
విసరేవి రాళ్ళు
పడుచుపిల్ల ఎదురైతే
పైన పడేవి రాళ్ళు

నువ్వూ నేను తినే
బియ్యంలో తెల్ల రాళ్ళు

పువ్వులాంటి చంటి బిడ్డ
కిడ్నీలో గులకరాళ్ళు

క్వీన్ ఎలిజబెత్తు
కిరీటంలో మెరిసేరాళ్ళు
అంగనల ఒంటినిండా
బంగారులో పొదిగినరాళ్ళు
దొంగలు దొరలూ కోరేవి
బంగారపు టీటుకరాళ్ళు
అసలును మించిన లాభాలకు
ఆధారం తూనికరాళ్ళు

ప్రతిచోటా మహామంత్రులు
ప్రతిష్ఠించేవి పునాదిరాళ్ళు
మహాత్ములంతటి వాళ్లను
మరుగున పెట్టేవి సమాధిరాళ్లు
దారి పొడుగునా మనకు
దర్శనమిచ్చే మైలురాళ్ళు
వీధి వీధి నా నాయకుల
విగ్రహాల పోతరాళ్లు

బ్రతుకు కొరకు కార్మికుడు
పగులగొట్టేవి కొండరాళ్ళు

పట్టభద్రులచే సైతం
పని చేయించేవి జీతపురాళ్ళు

నరునికి నరునికీ మధ్య
గిరి గీచేవి సర్వేరాళ్ళు
గిరి దాటిన సోదరుని
శిరసు పగలగొట్టేవి అవేరాళ్ళు

అందాల చంద్రునిలో కూడ
అన్నీ కటిక రాళ్ళు
అంతగా ప్రయాసపడి
అమెరికనులు తెచ్చినవి రాళ్ళు.



# అశ్రుతర్పణం

(1952 లో శ్రీ వేపా కృష్ణమూర్తి, ఛీఫ్ ఇంజనీరు,
విజయవాడ దగ్గర, కృష్ణానది ఆనకట్టను రక్షింపబోయి
వీరమరణం పొందిన దుర్వార్త విని)

కృష్ణమూర్తీ!
అపర భగీరథ మూర్తీ!
స్థిరమై నిల్చిపోయింది నీ కీర్తి!
తెల్గు పౌరుషానికే వన్నె తెచ్చిందినీస్ఫూర్తి!!

ఆనాడు—దుర్దినం-
అఖిల భారతావనికే అపశకునం!
కార్మొగిలు మదపుటేనుగు
కట్లు త్రెంచుక విహరిస్తోంది.
కనక దుర్గా వాహనం
గట్టిగా గర్జిస్తోంది.
ప్రచండ ప్రవాహ వేగంతో
పరుగులిడుతోంది కృష్ణాతరంగిణి
ఉత్తుంగ తరంగ ధాటికి
ఊగిపోతూంది ఇంద్ర కీలాద్రి
చలించి పోతూంది సమస్త ప్రాణకోటి
చలించలేదు నీవు—

తన దారి కడ్డు వచ్చిన
ఆనకట్టపై ఆగ్రహించి
ఒళ్ళు విరుచుక పడింది
సుళ్ళు తిరుగుతోంది కృష్ణవేణి!
కస్సుమని లేచిన కాలసర్పాన్ని
అవలీలగా పట్టబోయే మంత్రవేత్తలా
అడుగు ముందుకు వేశావు.
కాళింది మడుగులో కాళీయుని శిరసెక్కిన
బాలగోపాలుని ప్రౌఢి వహించావు
ఫలించక పోతేనేం నీ యత్నం?
భళీ! అనిపించుకొన్నావు నేస్తం!!

మరణించలేదు నీవు
మరణం పిరికి పందలకే కాని
మహా వీరులకు లేదు సుమా!
నీ సజీవ జల సమాధి నుండి
నిత్యం జన్మిస్తున్నారు విజ్ఞాన వీరులు
బంధిస్తున్నారు కృష్ణవేణిని
బ్రతికిస్తున్నారు నాగార్జునుని
నిన్ను బలిగొన్న ఆ కృష్ణా జలాలు
నిల్కడ వహించి తెల్గుతల్లి ముంగిట నిలిచి
ముత్యాల తుంపురుల ముగ్గులు పచరించి

మరుభూముల మరకతాలు మొలిపించిన నాడే
నీ పవిత్రాత్మకు శాంతి
నిఖిలాంధ్ర భువికి ప్రశాంతి.
కర్మవీరా ! నీకిదే మా అశ్రుతర్పణం
కార్యశూరా ! నీకిదే సహస్ర నమస్సమర్పణం.

అందుకో మా శ్రద్ధాంజలి
ఆనంద స్వర్గధామం నుండి
పనీపాటా లేని ప్రాత స్వర్గంలో
పచారు చేస్తూ బ్రదుకగలవా నీవు ?
శ్రమజీవులలో శ్రమజీవిగా
సంచరించిన నీవు
సురాపానంతో సోలుతూ తేలుతూ
శృంగార భంగిమల నభినయించే
అప్సరోంగనల మధ్య ఆడగలవా ?
జలజలా ప్రవహించే చదలేటి యిసుక తిన్నెలపై
పిచ్చుక గూండ్లను కాదు పెద్ద ఆనకట్టలు కట్టి ఉంటావు.
పరిమళ పారిజాతోద్యానాల మధ్య
ఫల వృక్షాలను పచ్చని పైర్లను కూడ పండిస్తుంటావు.

నాకలోకంలో విప్లవం నీ వంతు
నరలోకంలో అభ్యుదయం మా వంతు.

దివికి భువికి మధ్య తేడాలు తొలగిద్దాం.
దివిని భువిగా భువిని దివిగా మార్చేద్దాం.

నీ స్మృతిచిహ్నంగా నేడే కైకొంటున్నాం
నిర్విరామ కార్యదీక్ష !
నీ అసమాన సాహసమే మాకు నిరంతరం
శ్రీ రామ రక్ష ! !



# విక్రమసింహపురి

మొలగొలకుల బియ్యపు పస
పలు వరుసలలో హసింప పటువాక్చతురుల్
వలెవాటుతోడ వత్తురు
పలువురు నెల్లూరు సీమ పల్లెల కాపుల్

* * *

ఇది విక్రమ సింహపురం
ఇది నిత్య కళాకేంద్రం

పెన్నానది చిగురు టిసుక తిన్నెలపై విహరించే
వన్నెలాడు లున్నారిట కన్నెత్తిన ప్రమాదమట !
మైకాతేడులు సంపదమైకముతో పరువెత్తే
"బ్యాకులు"కలవిట వానికి "బ్రేకు"లతో పనిలేదట!

మెల్లగ ప్రవహించుతోంది! తల్లివోలె పెన్నానది
చల్లగ పయనించుతోంది ! పంటచేలపైని గాలి
వరి వెన్నుల పసిడినగలు ధరిస్తుంది ధరారమణి
తళతళ "మైకా" రేకుల వెలుగుతోంది పుడమిరాణి

భక్తహృదయ నవశిరీష పరిమళ సుమతల్పమెక్కి
పవ్వళించియున్నవాడు పువ్వుల రంగయ్యసామి
సవతితోటి పోరుమాని చాంచల్య గుణమ్ముమాని
సంసారం నెరపుతోంది సంపదల పూవుబోణి

అరణ్యాన వదలబడిన ఆంధ్ర మహాభారతాన్ని
తెనుగు తోటలోన నాటి తీయదనం పాదుచేసి
పిండిన రస మొలుకునట్టి కండగలుగు చెఱకు గడగ
తీర్చిదిద్ది పోషించిన తిక్కయజ్వ మందిరమిది

కవితా రాజ్యమే కాదు ఘన సామ్రాజ్యం సైతం
కలంబలంతో జయించి కామకగా సమర్పించి
మనుమసిద్ధి నృపునిచేత "మామా" అనిపించుకొన్న
మహనీయుడు కవిబ్రహ్మ విహరించిన దేశంబిది

గౌతమీ పినాకినుల కవితా తోయములు కలిపి
ఆంధ్ర రసిక హృత్సీమల ఆనందం పండించిన
ప్రబంధ పరమేశ్వరుండు ప్రభవించిన మండలమిది॥
కొఱకరాని ప్రాగల్భ్యపు కొబ్బరి కాయలనిచ్చట
వేదం వేంకటరాయడు భేదించెను శ్రమలకోర్చి
అతని కలం సృష్టించిన ప్రతిభానిధి "యుగంధరుడు"
ఢిల్లీ సుల్తానులనే తల్లడిల్ల జేసినాడు.

ఆతని మంత్రాంగమ్మును ఆలించిన "పేరిగాడు"
కాకతీయ సామ్రాజ్యం ఘనముగ పాలించినాడు॥॥

నిఖిలాంధ్ర కళారామం నిత్యవసంతమున దేల
కవికోకిల కంఠమెత్తి గానమ్మొనరించె నిచట

అతని "పానశాల"దూరి అందినంత మధురసమ్ము
కై పెక్కగ త్రాగినారు గడిదేరిన రసికులెల్ల॥

పగతురచే ఓడిపోయి పారివచ్చు ప్రాణ పతిని
నులకమంచ మడ్డుపెట్టి జలకమాడగా బిల్చిన
వీరాంగన మాయూరికి గారాబపు ఆడబడచు.

తన యెమ్ములె యిటుకలుగా తెనుగుతల్లి కొక సౌధం
తనరక్తం తైలముగా తెనుగుజాతి కొక దీపం
కట్టించిన ముట్టించిన "పొట్టి" వంశవర్ధనుండు
పుట్టినదీ త్యాగసీమ మెట్టినదీ భాగ్యసీమ.

ఆంధ్ర సాహితీ యమునా సైకతాల విహరించుచు
శాంతినికేతన ప్రశాంత భావఝురుల గ్రుంకువిడుచు
ప్రాభవ మురళీధరుడై భారత బృందావనాన
అభ్యుదయ మరధుగీతిక లాలపించు "గోపాలుడు"

పాతికేండ్లు సింహపురిని పాలించిన శక్తి "ఏ.సి"
కావుమన్న వారికతడు ఘనవిద్యుద్దీప రేఖ
చావుమన్న వారికతడు షాకు గొట్టు మెఱపు రేక.

తిక్కన కవి దైవమ్మను తిక్కవరపు రామిరెడ్డి
తనను వలచి వచ్చినట్టి ధనలక్ష్మికి ప్రియుడతండు
పాత్రదాన భాగీరథి ప్రభవించు హిమాద్రియతడు.

# గూబల రాజ్యం

( బంగ్లాదేశ్ విమోచన యుద్ధ సందర్భంలో 1971 )

రాజ్యం చేస్తున్నవి రాకాసిగూబలు
రాత్రియే సత్యం, నిత్యం అనుకొని
చీకటిలో చేసిన తప్పులు
లోకానికి తెలియవని
ప్రజాస్వామ్య కోకిల గొంతును
పగబట్టి నులిమేస్తున్నవి.

పశుబలాన్ని ఉసికొల్పి
ప్రతిపక్షి గూట దూరి
పసి కూనల్ని సైతం
కసిగా కొరికేస్తున్నవి.

ఆగ్రహాన్ని పట్టలేని
ఆనాటి అశ్వత్థామలా
పుట్టబోయే శిశువును కూడా
మట్టు పెట్ట చూస్తున్నవి.

నిదురించే అమాయకుల
తుది అరపులు వినరాకుండా
పరుగెత్తే శరణార్థులు

తిరిగి చూచు శ్రమ లేకుండా
మారణ హోమం చేస్తున్నవి.
శాంతి జపం నటిస్తున్నవి.

నదులలో ప్రవహిస్తున్నది
ఉదకము కాదు ఉడుకు నెత్తురు
నీళ్లపై తేలుతున్నవి
పెల్లగిల్లిన మ్రానులు కావు
కుళ్లిన మానవ కళేబరాలు
ఇండ్లలో ప్రొయ్యిలు కాదు
ఇండ్లే మండుతున్నవి
నర రక్తం త్రాగి త్రాగి
ఎరుపెక్కెను బంగాళాఖాతం
నరమాంసం మెక్కి, మెక్కి.
అజీర్తి పడె అగ్ని దేవుడు.
సాక్షులై చూస్తున్నవి
లక్షల నక్షత్రాలు
కళ్ళ నీళ్ళు పెట్టుకున్నవి
బీళ్లైన మహాక్షేత్రాలు.

ప్రజాస్వామ్య రక్షణకై
ప్రతిన గొన్న రాబందులు

ఏమీ జరగనట్లు, ఎరుగనట్లు
వేషాలు వేస్తున్నవి.

మిగిలిన ఎముకల కోసం
గుటకలేస్తూ కూర్చున్నది
గుట్ట మీద గుంట నక్క—
శాంత్య హింస లంటున్నది
చేవ లేని పావు రాయి.

ఈ దారుణ కృత్యాలు
ఈ పిశాచ నృత్యాలు
ఎంత సేపో సాగవులే
రాత్రంతా చీకటి బొగ్గుల
రగులుకొన్న సంధ్యాజ్వాలలు
భగ్గు మనుచు మండక మానవు

కరకర సూర్యుడు పొడిచే
గడియలింక రాకపోవు
గూబల బింకాలు సడలి
గుహాలో దూరకపోవు.

---

# బంగ్లాదేశ్ పుట్టినరోజు

( 16, డిసెంబరు, 1971 )

పదహారు డిసెంబరు రోజు
బంగ్లాదేశ్ పుట్టినరోజు
పాకిస్తాన్ క్రూర నియంత
పాపాలకు ఆఖరు రోజు !!!

ఢక్కాలో ధర్మవిజయ
ఢంకా మ్రోగించిన రోజు
ప్రజార్ణవం ఆనందంతో
పరువళ్లు త్రొక్కిన రోజు !!!

" జిన్నా " రక్తహస్తాలతో
జీవం పోసిన జరాసంధుని
భారతభూమి భీమ సేనుడు
బద్దలుగా చీల్చిన రోజు !!!

ఇందిరా చాకచక్యం
ఇండియా ప్రజా సమైక్యం
రూఢిగా మన చరిత్రలో
ఋజువు చేసికొన్న రోజు !!!

స్వయం శక్తి లేకుండా
జాతి బ్రదుక జాలదని
పరాశ్రయం ఎవరికైన
ప్రమాదమని తెలిపిన రోజు.

భారతీయ వీర మరణ
ప్రతిజ్ఞలు చెల్లిన రోజు
వీరమాతలై వీరపత్నులై
భారతాంగనలు వెలిసిన రోజు !!!

ఒక్క కోటి నిరాశ్రయుల
మ్రొక్కుబళ్ళు తీరిన రోజు
చిక్కని నెత్తుటి జల్లులు
ఒక్కసారి ఆగిన రోజు !!!

ప్రళయ కాల దీర్ఘ రాత్రి
బళ్ళున తెలవారిన రోజు
ఒక్క లక్ష గ్రుడ్లగూబలు
చిక్కుపడిన వెలుతురు రోజు!!!

వీరరక్తకాసారంలో
విజయపద్మం మొలచిన రోజు
నవమాసాల బరువు తొలగి
నవరాజ్యం పుట్టిన రోజు !!!

# మడివేలు

మాసినట్టి బీర మాటికి బండపై
మోదుచున్న చాకి ముసలివాడ!
ఉదుకవోయి! జగతి యుగయుగమ్ముల నుండి
కుదురుకొన్న మురికి వదలిపోవ.

మైల బట్టలుతుకు మడివేలువని నిన్ను
పరిహసించు వారి కెఱుకలేదు
చదువరులను మించు చాకలియన్న వా
క్యమ్ములోని వాస్తవమ్ము సఖుడ!

అల ప్రతాపరుద్రు డరులచే జిక్కగా
గద్దెనెక్కినట్టి ఘనత నీది
పేరిగాని నాటి సారస్యపున్ద్రాడు
వివిధ రూపములను వెలయునేడు.

భీతి యొకింత లేక రఘు
వీరుని కొల్వున, జానకీజగ
న్మాత పవిత్ర శీలమున
మచ్చలు చూపగ బూనినాడు నీ

జాతి సహోదరుండతని
        సాహసమేది స్వతంత్ర భారత
క్ష్మాతలమందు ధర్మగుణ
        చర్చలు చేసెడు నాయకాళికిన్ !

నీరదావృతమైన నీలాంబరమ్మును
        కౌముదీ జలముతో గడుగునెవడు
చంద్రికా సరసిలో శరదభ్ర శకలముల్
        పిండి, గాలికి ఆరవేయునెవడు
దెసమొలతో నున్న తీవపూబోండ్లకు
        చిగురుచీరల నందజేయు నెవడు,
భూదేవి పదముల బొరలాడు కడలేని
        కడలి కుచ్చెళ్ళను మడచునెవడు.

యుగయుగమ్మున కొక్కమా రుదయమంది
కలుష హృదయాల నమృతాన గడుగునెవడు
విశ్వకర్త అతండు నీ వృత్తివాడు
ఇంత గౌరవ భాగ్య మింకెవరి కబ్బు!

ఏ గొంతు కోసిరో ఈ తడిగుడ్డతో
        నెత్తురు మరకలు నిండి యుండె,
ఏ రోగి మీదిదో ఈ పాతకంబలి
        చీము నెత్తురులతో చివికి యుండె,

ఏ అంచగొండిదో ఈ రహస్యపు జేబు
హేమ సౌరభముల నీనుచుండె,
ఏ సినీతారదో ఈ పయ్యెద చెఱంగు
మృగమద రేఖలు మెఱయుచుండె;

అన్ని నీ బానలో మున్గి వన్నె మార్చి
వెలికి వచ్చును గత చరిత్రలను దాచి
పుడమి పాపాలు తనలోన గడిగివైచు
గాంగ సలిలమ్ము నీ యింట గలదు సుమ్మ,

ఏనుగు తోలైన ఎన్నాళ్ళు కట్టును
పరమేశ్వరుడు శుభ్రపఱచకుండ,
హేమాంబరమునైన ఎన్నాళ్లు ధరియించు
పద్మనాభుం "డిస్త్రి" పట్టకుండ
కావిగుడ్డలనైన ఏ విధిదాల్తురు
ముని పుంగవులు నీట ముంచకుండ,
"నైలాను" లగు గాక ఏ లీలదాల్తురు
భూజనుల్ మడతలు పోవకుండ

శివుడు వసియించు కైలాస శిఖరమైన
పరమపదమైన వనమైన పురమెయైన
గడియ జరుగదు నీ సేవలడుగకుండ
త్రిజగదభినుత కైంకర్య! రజకవర్య!

నీవు యత్నించుచో నిండు పున్నమి జేని
యెడదపై వెనుమచ్చ తుడువగలవు,
నీ చేతి కందెనా నీలాంబరమ్మును
జాడించి తెల్లగా సలుపగలవు,
నీవు సేవించుచో నీలకంఠుని కంఠ
విషవైల్యమునె మార్చి వేయగలవు,
నీ చాకి బండపై నిమిషమాగిన, వర్ష
జలధరమ్ముల రంగు వెలిసిపోవు,

ప్రత్యహమ్ము మైల పడు నేటి మా వేష
ములను చెవులు పట్టి, మురికి వదల
గొట్టి, వేలగట్టు దిట్ట, వసాధ్యమ్ము
లేదు నీకు రజక సోదరుండ!

పొలము కాపుల స్వేద జలధారలో నాని
అట్టగట్టిన నూలు పుట్టములకు,
శత్రుకోటి నెదిర్చి క్షతగాత్రుడగు వీర
మౌళి రక్తారుణ చేలములకు,
యంత్ర భూతాల మధ్య శ్రమించు కార్మికు
మసిపట్టిపోయిన వసనములకు,
ఎలప్రాయపున్ జంట వలపు కౌగిళ్ళలో..
నలిగిపోయిన పట్టు వలిపములకు,

జీవములు పోసి బిగియును జిగియు గూర్చి,
తిరిగి సమయాన కీవ అందింపకున్న,
గడియలోన ముస్తాబయి కదలుటెట్లు !
తీరికేలేని యీ నాటి పౌరజనులు.

పీతాంబరుని బిల్చి పిల్లనిచ్చిన మామ
గజచర్మధారికి గరళమిచ్చె,
దారవేషమునకు విందుల నొసంగిన గేస్తు
చింపిగుడ్డల వాని సీత్కరించె,
అద్దెగుడ్డల వాని కర్ఘ్యాసనంబిచ్చె
కౌపీనధారిని కసరికొట్టె,
జలతారుముసుగున్న శిలను దైవమ్మనె
త్రోవ కడ్డమ్మైన తొలగదన్నె,

వలువలను బట్టి లోకాన విలువ హెచ్చు,
వలువలకు విల్వ హెచ్చు నీ చలువ వలన,
అట్టి నీ చేతి చలువ మహత్త్వమెఱుగు
ఘనులకే గద నేడు సత్కార సభలు.

"సినిమా"కు సిద్ధమై చీర మంచిది లేక
యింటి కోడలు సంశయింప సాగె,
ఉడుపులు మానెను బడికెట్లునే బోదు
నని చిట్టి కుఱ్ఱడు హఠము పెట్టె,

దవ్వుల పయనమ్ము తగిన దుస్తులు లేవ
 టంచు ఉద్యోగి చింతింప సాగె,
పఖుడిష్టపడు చీర సమయమ్మునకు లేమి
 క్రొంగ్రొత్త వధువు గగ్గోలు పడియె,

ఎపుడు వచ్చునో మడివేలు ఎపుడు చలువ
మడత లందించునోయని మా గృహమ్ము
వేయికన్నుల నీకయి వేచియుండె
జాగుతగదోయి చాకలీ! సాగిరమ్ము.

లలనామణుల తనూలతల నంటి నటించు
 పరిక్రొత్త కుసుమగుచ్ఛములు కొన్ని,
పరసుల మేలిబొజ్జల మీద మిసమిసల్
 వాటించు చిగురుజొంపములు కొన్ని
చిన్నిబాలల పైడి వన్నె యంగములపై
 ప్రాకెడు కనకాంబరములు కొన్ని,
పండు వృద్ధుల మేనికొండనెత్తమ్ముల
 లంకరించెడు శాద్వలములు కొన్ని,

నీవు కొనితెచ్చి ముంగిట నిలిచినంత
ప్రతిగృహాన వసంత శోభలు చెలంగు
ప్రతి ముఖమ్మున చంద్రికా ప్రభలు మొలచు
వన్నియల తేడ! చాకలి చిన్నవాడ.

6)

# కృష్ణవేణి

అనాదిగా
అవని పుట్టిన దాదిగా
ఒయ్యారపు నడకలతో
సయ్యాటల ఉరుకులతో
సాగిపోయే కృష్ణవేణీ !
ఆగలేవా పరుగుమాని ?

నీవు ఆగినచోట నిలుచునందనవనులు
నీవు తాకినచోట మొలుచు మరకతమణులు
నీవు దూకినచోట మెఱయు విద్యుల్లతలు
నీవు ఆడిన చోట కురియు స్వర్ణాక్షతలు !

నీ శీతల జీవన స్పర్శ కొఱకు
నీ అమృత హృదయాలింగనం కొఱకు
బడలిన ఒడలితో
బరువెక్కిన ఎడదతో
నిట్టూర్పులతో
నిలువుగాళ్లతో
తరతరాలుగా
చివరియాశతో

ఎదురు చూచుచున్నది
యావదాంధ్ర జగతి ॥

నీ నడకల మలుపులతో
పెనవేసికొన్నది తెలుగుల చరిత్ర
నీ ప్రచండ ప్రవాహ వేగంతో
కలిసి పొంగింది మహాంధ్ర శౌర్యం
నీ అలల గలగలల పాటలలో
శ్రుతి కలిపి పాడింది తెలుగుశారద

అజేయులైన ఇక్ష్వాకుల
అశ్వమేధయాగ హవిస్సు
ఆచార్య నాగార్జునుని
అమూల్య విజ్ఞాన పయస్సు

రాయల అంతఃపురకాంతలు
హాయిగ జలకాలాడిన పన్నీరు
బహమనీ సుల్తానులు
పట్టపగలు హత్యచేసిన
విజయనగర పౌరుల
వేడి నెత్తుటి జల్లులు
బాలచంద్రుని రక్తతిలకం

మాంచాల పసుపు కుంకుమ
అన్నీ కలిసి పోయినవి నీలో !

జొన్న కూడు చవి చూచిన
శ్రీనాధుని చాటువులు
నాగమ్మ నాగుబాము పగకు
బూడిదైన కాపురాల గోడులు
పలనాటి కోడిపుంజుల
పౌరుషగాధలు
బ్రహ్మనాయుని చాపకూటి
సిద్ధాంత బోధలు
అన్నీ విన్నావు నీవు !

నీవు తమ యింటి కోడలు కావాలని
నీలాల పైరుల నిసువులకు పాలిచ్చే
నిత్యయౌవనపు పచ్చి బాలెంతవుగా మారాలని
నీ అందాల అలల ఉయ్యాలలపై
తమ బాలల ముత్యాల తెప్పలు తేలిఊగాలని
కలలుగన్న తెలుగుజాతి
సాష్టాంగ పడింది నీ కడ్డుగా
చలియింపని ఆనకట్టగా
మిన్నులు తాకే ఈ ఆనకట్ట

ఇన్నాళు కోట్ల రూపాయలకట్ట
నీ జీవన సాగరానికి చెలియలికట్ట !!

ఎందరి కార్మికుల కండలు కరిగిన జీవశక్తి
ఎందరు సాంకేతిక నిపుణుల మేధాసంపత్తి
ఎన్ని మహాయంత్ర భూతాల అశ్వికశక్తి
ఎందరు గుత్తదార్ల కార్యాసక్తి, యుక్తి
పునాదిగా వెలసిందో ఈ మహా నిర్మాణం
పుడమిరాణి కొాక రవ్వల ఒడ్డాణం!!
ఈ నిర్మాణ మహాయజ్ఞంలో ధనరాసులు ఆజ్యధారలైనవి
కొన్నిగుండెలకు పండుగైనది కొన్ని కండలకు ఎండుగైనది
జనపదాలు మునిగినవి ఘనశిల్పాలు తేలినవి
కొండలు పిండియైనవి పిండి తిరిగి బండలైనవి
ఆంధ్రుల బొక్కసం అప్పుల పాలైనది
ఆంధ్ర కర్షకలోకం ఆశలు పెంచుకున్నది
అంతా నీ పేరు మీదుగా జరిగిపోయినది!!

మహారాష్ట్రిల యింటబుట్టి
మహారణ్యాల త్రోవబట్టి
శ్రీశైలం మల్లన్న
శిరస్సు నభిషేకించి
ఇంద్ర కీలాద్రి నొరసి

కనకదుర్గ కాళ్లు కడిగి
కడలితేని కలిసికొనగా
ఒడలు మఱచి పరుగెత్తేనిను
నంది కొండకు చుట్టూ
బందీగా చేశారని
ఉగ్రరూపం తాల్చకు
ఉవ్వెత్తుగా లేవకు
మొన్నటి వంతెనలాగా
తన్నకు మా ఆనకట్టను॥

శివుని జటా జూటంలో
చిక్కుకున్న జాహ్నవిలా
నాగార్జున సాగరమై
ఆగుమిచట కొంత తడవు
అభినవ భగీరథుల వెంట
అఖిలాంధ్రం చుట్టి రమ్మా.

సాగరునకు నీకు మధ్య
సాగుతున్న ప్రణయగాధ
ఈనాటిది కాదనీ
ఏ నాటికి పోదనీ
ఎఱుగుదు మమ్మా- కానీ
విడువము నిన్ను దొరసాని॥

అవునులే....

అలలచేతులెత్తి పిలుస్తున్నాడు

ఆరాట పడుతున్నాడు నీ ప్రియుడు

అయినా తప్పదులే

ఆంధ్రుల ఆతిథ్యం నీకు !!

అవిగో.... అటుచూడు

నెత్తువారిన రేగడి నేలలు

కళ్ళు నడవని కటికి బీడులు

అంబా అని అరుస్తున్నవి

ఆకొన్న ఆవు లేగల్లా

ఒక్కమారు పొదుగుచేపి

వర్షింపుము అమృత ధార

అఖిలాంధ్ర మహాజనులు

అనుభవింతురు తనివిదీర !!!



# పైరవి

పైన రవి
క్రింద భువి
మధ్యనున్నది పైరవి

ఇల్లాలి పెదవికి చప్రాసి పదవికి
ఈనాడు చేయాలి పైరవి
సామాన్యులకది పెద్ద కారడవి
చాతుర్యవంతులకు రతనాల దీవి

ప్రజా ప్రభుత్వ గోపాలుడు
పలికించే పిల్లన గ్రోవి
అధికార గోపికాంగనలకు
ఆనంద భైరవి
అమాయక ప్రజల బ్రతుకమ్మ పాటకు
అంతులేని పల్లవి పైరవి

బాలునికైనా గోపాలునికైనా
యంత్రికైనా ప్రధాన మంత్రికైనా
కన్నులకగపడకుండా
వెన్నపూస రాయడం పైరవి.

కత్తులు ఝళిపించకుండా
మెత్తగా కోయడం పైరవి

శివునాజ్ఞ లేకుండా చీమైనా కదలదు
పైరవి లేకుంటే ఫైలే కనిపించదు
జోలపాట లేకుంటే బాలుడు నిదురింపడు
శాలువైన లేకుంటే సత్కవి పద్యం వ్రాయడు

గుళ్ళో దైవానికి నైవేద్యం పైరవి
బళ్ళో పంతుళ్ళకు పై జీతం పైరవి
పాలిచ్చే గేదెకు పచ్చిగడ్డి పైరవి
పర్మిటు వ్రాసే చేతికి పచ్చనోట్లు పైరవి

పైరవి సర్వాంతర్యామిని
పైరవి కామరూపధారిణి

యుగానికొక్క అవతారంలో
ఉదయిస్తాడు దేవుడు
గడియకొక్క రూపంలో
కనిపిస్తుంది పైరవి

కొందరికది నవరసాల విందు
కొందరికి మంచి నిషా మందు
కొందరికి అందాల భామల పొందు

7)

కొందరికి ఘజల్ పాట
కొందరికి ఖవాళీ ఆట
కొందరికి చెవిలో మాట
కొందరికి గువ్వల వేట
అందరినీ మురిపించే
అపరంజి బాట భైరవి

భైరవి మహత్త్వమెరిగిన
ప్రబుద్ధులు కదా మన పెద్దలు
అందుకే మన దేవుళ్ళకు
అనుదినం మేలుకొలుపులు
పంచ భక్ష్యాల కుడుపులు
బంగారు సొమ్ముల ముడుపులు
పవ్వళింపులు, జోలపాటలు



# దొంగలున్నారు జాగ్రత్త !

దొంగలున్నారు జాగ్రత్త
త్రోవ పొడుగునా ఇదే వ్రాత !
తీర్థయాత్రల రైలు బండిలో
తిరుపతి వెంకన్న హుండిలో
కోటలో పేటలో
తోటలో బాటలో
బడిలో గుడిలో
ఫలాహారశాలలో
ప్రకటించిన యీ వ్రాత
బహుశా మన జీవనగీత !

కోడియైకూసిన యింద్రుడు
లేడియై దూకిన మారీచుడు
పేడియై ఆడిన నరుడు
పూబోడియైన నారాయణుడు
కలిగి మెలిగిన యీ దేశం
కాదా దొంగలకు నివాసం !

వ్రేపల్లెలో ఆనాడు వెన్నదొంగ
మాపల్లెలో ఈనాడు పన్నుదొంగ

ఇద్దరు లక్ష్మీనాధులే
ఇద్దరు లోకాధినేతలే

పేదవానికిచ్చు మందులో
పెద్ద మనిషికిచ్చు విందులో
సేటుగారి తక్కెడపట్టులో
సీలు చెదరని ఓట్ల పెట్టెలో
దొంగలున్నారు జాగ్రత్త.

ఘనమైన డిగ్రీ సాధించాడు చదువుదొంగ
ధనం పండే పదవి చేపట్టాడు పనికిదొంగ
గద్దెనెక్కి యేల్తున్నాడు పగటిదొంగ
ఇందరు చేరింది సర్కారు
ఏం చేయాలన్నా తకరారు.



# ఏమైనారు!

గౌతమ బుద్ధుడు ఏమైనాడు!
"క్రిస్టిన్ కీలరు" కామక్రీడల
కిటికీ కాక తెరయైనాడు
ఏసుక్రీస్తు ఏమైనాడు?
కన్నెల నమ్మే "ఫాదరు" మెడలో
"క్రాసు" మీద మెడ వాల్చాడు

గాంధి తాత ఏమైనాడు?
కల్లంగడి ముంగిట బొమ్మై
కన్నార్పక చూస్తున్నాడు.
పండిత నెహ్రూ ఏమైనాడు?
ఎఱ్ఱకోట పొలిమేరలలో
ఎఱ్ఱ గులాబిగ మొలిచాడు

పరమ శివుడు ఏమైనాడు?
లింగాయతుడై తక్కువ వారిని
క్రుంగ దన్ని పొమ్మన్నాడు
మహావిష్ణువేమైనాడు?
తిరుపతి కొండల మంగలి వాడై
తిరు క్షౌరములు చేస్తున్నాడు.
మహమ్మద్ ప్రవక్త ఏమైనాడు?

ఖాను రహమానును కొడితే
పోనీలే అంటున్నాడు

ప్రజలంతా ఏమైనారు?
"బూతు"న పుట్టిన ప్రజాస్వామ్యమును
గోతుల్లో పడవేస్తున్నారు
మాజీ నాయకు లేమైనారు?
మతం మార్చుకొని గతం దాచుకొని
మహామంత్రులౌతున్నారు

మహాకవులు ఏమైనారు?
నవరసాలు నింపిన "సీసా"లు
నయాపైసల కమ్ముతున్నారు

విప్లవకవులు ఏమైనారు?
కత్తులు పట్టే సత్తువ లేక
ఉత్తకేక లేస్తున్నారు

విద్యార్థులు ఏమైనారు?
విద్యరాక ఉద్యోగం లేక
వీధులలో ప్రోగైనారు
బస్సులతో మిస్సులతో
పరిహాసాలాడుతున్నారు

ఉద్యోగులు ఏమైనారు ?
జీతాలకు జీవితాలకు
"వి" భేదం ఎందుకని
సమ్మెచేసి జీతాలు
సాధిస్తూ ఉన్నారు

మహాప్రభువు లేమైనారు ?
కష్టసుఖాల్లో కష్టాలు మీవి
సుఖాలు మావి అని
క్రమంగా సమంగా పంచుకొన్నారు



# వివేక శిల

(కన్యాకుమారిని దర్శించినపుడు – 1970)

మూడు సముద్రాలు భారత భువిని
ముద్దాడే చోట
కన్యాకుమారి శివునికై
గాఢ తపస్సు చేసిన చోట
వెలసిందొక గొప్ప శిల – ఆ శిలపై
వివేకానందుని తల

ఆ శిలపై నిలిచి కలగన్నాడు నరేంద్రుడు
స్వదేశం వైపు చూచి విలపించాడు యతీంద్రుడు
అతని కన్నీటి వెల్లువలో మున్నీరు మునిగిపోయినది
అతని స్వప్నవీధిలో ప్రబుద్ధయై భారతజనత నిలిచినది

అతని రూపు అమెరికాకు పయనించినది
ఆతని చూపు మాతృపదాల విలసించినది
అతని వాక్కు దిగంతాల ప్రతి ధ్వనించినది
అతని కీర్తి భారతమూర్తిని ప్రతిష్ఠించినది.

నలుబది యేండ్లకే కన్నుమూశాడు నరేంద్రుడు
నలుబదికోట్ల ప్రజల కండ్లు చెమరింపజేశాడు మునీంద్రుడు

ఇనుప కండలు కావాలన్నాడు నరేంద్రుడు
ఇనుముకోసం కండలు కరిగిస్తున్నాడు కార్మికుడు

పిడుగువలె మండవలెనన్నాడు నరేంద్రుడు
పిడకవలె కాలుతున్నాడు నేటి భారతీయుడు
కాలే కడుపుకు మతబోధ వద్దన్నాడు నరేంద్రుడు
మతబోధతో కడుపునింపుతున్నారు కుహనామునీంద్రులు



# రూపాయి

ఓ రూపాయీ
నీవు లేకుంటే లేదు హాయి
నీ చుట్టూ తిరుగుతోంది
భూగోళం పగలు రేయి

నీవుచేతిలో ఉంటే ఎంత బడాయి
నీవు చేయి జారిపోతే
నీతి నిజాయితి అన్ని వస్తాయి

నీవే సృష్టిస్తావు
తోబుట్టువుల మధ్య లడాయి
అది కోర్టులో వాదించే వారికి
నీవే మళ్లీ కిరాయి

నీవు అమృతమైతే పంచుకోడానికి
నిల్చుకొని ఉన్నారు దేవదానవులు
నీవు శవమైతే ఆరగించడానికి
పొంచు కొని ఉన్నవి రాబందులు

ఆద్యంత రహితమైన ఆకారం నీది
వీణానాదం కంటె వినసొంపైనది నీ మ్రోత
భగవద్దర్శనం కంటె ప్రయోజనకరం నీదర్శనం

పరమేశ్వరుడు రెండు రూపాయలు
పడవేశాడు ఆకాశంలో
పగలును శాసిస్తుందొక వేడి రూపాయ
రాత్రిని రమణీయం చేస్తుందొక చల్లని రూపాయ

అందాన్ని ప్రేమిస్తారు కొందరు
చందాన్ని ప్రేమిస్తారు కొందరు
అందచందాల్ని ప్రేమిస్తారు మరికొందరు
అందర్ని ప్రేమింప జేయగల అందానివి నీవు
ప్రేయసీముఖం చంద్రబింబం కాదని
ముమ్మూర్తులా నీవేనని
ముచ్చటగా వర్ణిస్తున్నారు మహాకవులు
నింగిలో చందమామ నీవుగా
నీ చుట్టూ చిల్లర నక్షత్రాలుగా
నీలమేఘాలు గాలికి తెపతెపలాడే నోట్ల కట్టలుగా
కలలు గంటున్నాడు మా భాయి

అర్చకుని ప్రసాదం
అయ్యరు చేతిసాదం
మానవుల విద్యాప్రావీణ్యం
మానవతుల యౌవన లావణ్యం
కొనగలవు చేకొనగలవు నీవు

పసివాడు సమ్మె చేసినా
ప్రభుత్వం పన్ను వేసినా
దొంగ కన్నం వేసినా
దొరలు జేబులు తడివినా
అంతా నీ కోసమే

నీవు కదిలితే కాపలా సైన్యం
చేయి మారితే వేయి రెట్లు ఆదాయం
చేయి మారక పోయినా వడ్డీ ఖాయం
నీపై నిర్మించిన నేటి బ్రతుకు కార్ఖానాలో
మనుషులు మరలుగా మారిపోయారు
మనుషులు మనసులకు విడాకులిచ్చారు

ప్రతి మనిషికి ఖరీదు
ప్రతి మనిషి మనీషకు రసీదు
ప్రతి మనిషి మరణానికి దస్తావేజు
ఇది యీనాటి రివాజు



# గీతలోనే ఉంది

గీతలోనే ఉంది
జాతి భవిష్యత్తు
అందరికెలా తెలుస్తుంది
అది టీకాకారుని సొత్తు

చేతిలో సిరులిచ్చే గీత
చెట్టుపై రసమొలికే గీత
నుదుట తిరుచూర్ణం గీత
జేబుతో భగవద్గీత
మనకు చైనాకు మధ్య
మక్‌మోహన్ గీత!

ఈ గీతల మధ్యలో
ఇరుకుకొన్న భారత జనతా!
గీతల లోతులు తెలిసి
చేతలకు దిగేదెప్పుడు!

అరుగుమీది సాముద్రికుడు
అదృష్టం నీదేనన్నాడు
అదృష్టాలు పంచేవానికి
అర్ధ రూపాయి ఫీజుదేనికి?

గీతలో ఏమన్నాడు కృష్ణుడు ?
పాతకుల పీకల్ని కోత కోయమన్నాడు
పీకలు కోసేటందుకు
టీకాతాత్పర్యాలెందుకు ?

దేవుడే పది మార్లు
జీవుడై పుట్టినప్పుడు
దేవునికి జీవునికి మధ్య
కోవెల పూజారులు దేనికి ?

సకల జీవులు భూదేవి
సంతానమైనప్పుడు
ఇరుగు పొరుగు దేశాలకు
ఇనుపగోడల హద్దులు దేనికి ?

కర్షకుని నాగేటి గీత
కలదుసుమా అందు నీసౌభాగ్య సీత
శాస్త్రజ్ఞుని కలం గీత
చంద్రుని చేర వేస్తుందా వ్రాత
విప్లవ శస్త్రమై ద్యుని కత్తి గీత
విషమ సమాజ దుర్మాంసానికది చేయగలదుకోత

# విశ్వకవి

ఓ రవీంద్ర మహా కవీంద్రా!
ఓ రసాంబుధి పూర్ణ చంద్రా!!

భరత జననీ నిజ్యపూజకు
పసిడిగంట త్వదీయ గీతిక
సర్వ మానవ జాతికే ఒక
గర్వహేతువు నీదు పుట్టుక!!

పది శతాబ్దులు మూగవోయిన
భారతోర్వి నందనంబిదె
మధురమగు నీకుహూరవమున
మాఱుమోగినది!!

ఉపనిషత్ హిమశైలమును డిగి
ఉర్విదూకిన గాంగ ఝరివో!
భరతభూమిని తిరిగి రసమయ
భావనామృత సాగరములో
ఓలలాడగ జేయవచ్చిన
కాళిదాసుడవో!!

విశ్వసాహితి మేరుగిరిపై
వెలసినవి నీ అడుగుజాడలు

మాతృదేవికి నీ యశోరమ
మలచినది ముత్యాల మేడలు
కళాదేవత నీదురూపై
కానుపించినది !!

ఆకసమే రంగస్థలమ్ముగ
ఆడు నీ అతిలోకసుందరి
ఊర్వశిని గని బ్రహ్మఋషులే
ఊగిపోయిరిగా !!

నీదు మేధాగిరి తటంబున
నిర్గమించిన రసతరంగిణి
భవ్య "గీతాంజలి" కి విశ్వము
పరవశంబయ్యేన్ !!

కథలు చెప్పుచు కదలునొకపరి
కదను ద్రొక్కుచు ఉరుకునొకపరి
భక్తి తీవ్రావేశ పరవశ
భావమున నటియించు నొకపరి !!
నీదులేఖిని పోకడలు వ
ర్ణింప మా తరమా ?

కుంతి గుండెల కరుడు గట్టిన
అంతెఱుంగని పుత్రశోకం

ప్రభునికై ప్రాణాలు వదలగ
బాసచేసిన కర్ణురోషం
కళకు మాయని కొత్తదనమున
కనుల గట్టితివి !

కచుని నిశ్చల కార్యదీక్ష
కలికి వేడిన ప్రేకుభిక్ష
నీదులేఖిని తగిలి జగమున
నిలిచిపోయినవి !;

భారతీ చరణ మంజీర నిక్వాణముల్
పొదలె నీ లేఖిని కదలినపుడు,
ఉపనిషన్మధు ధారలుప్పొంగి పొరలె నీ
చేతోంబుజము వికసించినపుడు,
మలిసంజ మబ్బు పింజెలు ప్రామనుపడి చూచె
నీ హస్తమున కుంచె నృత్యమాడ,
అంతరిక్షమున అనంత తారకలు వీ
నులు విప్పివినె నీవు గళము విప్ప

వ్యాస వాల్మీకి కాళిదాసాది కవులు
తీవలై మ్రోగు వీణ నీ జీవితమ్మ
మధుర భావనానంద వార్నిధుల జగము
నోలలాడించి పోయితివో రవీంద్ర !!

౧౨

కనజాలితివి నీవు కటికి "కాబులివాని"
మదిలోన వాత్సల్య మధురసమ్ము,
వినజాలితివి సాంధ్య విహగ కూజితములో
నిఖిలేశు మధుర సందేశములను,
పఠియించినావు ప్రాభాత ప్రఫుల్ల పు
ష్పములోన భగవంతు ప్రణయ లేఖ
సత్కరించితివి అచ్చపు ప్రేమ నెదురేగి
మృత్యువు జగదీశు భృత్యుడనుచు
భువిని వసియించి, అవలీల దివిని దాకి
నరునకును విశ్వనేతకు నడుమ మేలి
పాలవెన్నెల బాటలు పఱచినట్టి
అమరకవి! రవి! నీకు జోహారులయ్య!!

సకల లోకము స్వర్ణభాజనముగాగ
చంద్ర సూర్యులు కర్పూర శకలములుగ
కాలపురుషుడు నీకు నివాళియొసగె
విశ్వకవి ! మాదు పూజల విలువ యెంత ?



# నే కోరిన ఆ ఉగాది

నే కోరిన ఆ ఉగాది
నిత్య శుభమ్ముల పునాది
ఇది కానే కాదు
ఇంకా రాలేదు

గున్నమావి క్రొంజిగురాకులు
కోకిలముల కుహూనాదములు
మల్లెపూల గుబాళింపులు
మదపు తేటి పాట సొంపులు
వేపపువ్వు పచ్చడులు
వ్రేలాడే ద్రాక్షగుత్తులు
ఈయలేవు నాకానందం
చేయలేవు నా "ఉగాది" ని !!

తెలుగు బిడ్డ భారతావనికి
వెలుగుచూపు మేధానిధియై
తెలుగుసీమ సకల జనాళిని
అలరించెడు అన్నపూర్ణయై
పిలసిల్లిన ఆ తేదీ
తెలుగు తల్లి కొరక "ఉగాది" !!

పండుటాకు చీరలన్నిటిని
పారవైచె తీగలు సైతం
ప్రాతతాటియాకుల మధ్యనె
పడియున్నది భారతజనత
ఇంక చంద్రుని మచ్చను
జింకయనుచు వాదింపక
మనుజుడు కాలం వెంబడి
మారిన నాడే "ఉగాది"
అదే సుమా నా "ఉగాది"
అఖండ విజ్ఞాన వీధి ॥

ప్రతి మనిషి జీవపూర్ణ
పారిజాతమై సుమింప
ప్రతి హృదయం ప్రేమామృత
భాగీరథి యై స్రవింప
భువినే దివిగా మార్చిన
నవ వసంతమే "ఉగాది"॥

హిందూ సాగర తరంగములు
హిమవన్నగ నవ తుషారములు
నులివెచ్చని కౌగిలింతలో
కరగిపోయి పులకించిన నాడే

భారత జాతికి "ఉగాది"
భావి నవోదయ ఉగాది !!!

అఖిల దేశ ధరాధిపులు
అహింసా దివ్యవాణి
అవధానము తోడ విన్న
ఆ క్షణమే మన "ఉగాది"
భారత సంస్కార వేది
ప్రపంచ శాంతి ప్రసాది !!



# గడ్డికోసం

గడ్డికోసి తేవాలని
దొడ్డకొడవలి చే బట్టి
గట్టుమీద నడుస్తున్నా
చుట్టూ పరికిస్తున్నా

నన్ను చూచి నవ్వింది గడ్డి
నాతో మాట్లాడింది గడ్డి
గడ్డికోసం వచ్చావా ?
బిడ్డా ! నామాట వింటావా ?

కుతుకలు కోయగలవే కాని మా
బ్రతుకులు కోయగలవా నీవు
తరిగే కొలది మీదికి
పెరిగే లక్షణం మాది
కోసేవానికి ధాన్యపు
రాసులిచ్చే వితరణ మాది

నేలతల్లి తొలికానుపు వారసులం.
గాలితోడ ఆడుకొనే గడ్డి పరకలం
తలనుదాల్చువారెవరో తెలిసికోగలం-మమ్ము
కాలరాచువారెవరో కనిపెట్టగలం

తొలకరి వానజల్లుల తడసి పులకించి
మేల్కొన్న భూమాత మేనిపులకలు మేము
సృష్టికర్త సజీవ చిత్ర ఫలకమ్ములో

చెలువమ్ము తరగని జిలుగు రంగులు మేము
ప్రియతముని రాకకై పృథివీ మహారాజ్ఞి
పఱచిన రత్నకంబళపు మెరుగులు మేము
తెలిమంచు ముత్యాలు తలమీద దాలిచి
బాలభానునికి నివాళి యిత్తుము మేము
మండుటెండలలోన మాయమై పోదుము
చినుకుపడినంతనే శిరమెత్తి చూచెదము
గడుసరి "గెరిల్లా"ల ఘన విక్రమము మాది
నిలుపులేక పదాతిదళమట్లు వ్యాపించి
గెలుచుకొందుము ఇలాతలము సర్వస్వము
పెనుతుపానుకు మహావృక్షముల్ విరిగినా
ఉనికితప్పక మేము మనికి సాగించేము
నడుమనే జనియించి నడుమనే నశియించు
తరురాజవంశాల దరిని బ్రదుకము మేము
మమ్ము త్రాడుగా జేసి మదపుటేనుగు బట్టి
స్వారిగావించు ఉపాయ మెరిగిన ప్రభులు
పనియైన పిదప మము పాదాల రాతురు
భోగిమంటలలోన బూది గావింతురు

ఎద్దులావులె కాదు పెద్దమనుషులుకూడ
గడ్డిదిన అలవాటుపడ్డ యీలోకాన
మేములేకున్న నిమేషమ్ము జరుగదు

భూమినేలిన దొరలు భూమిదున్నిన నరులు
మా కనుల యెదుటనే మా అడుగు జేరిరి
మా వ్రేళ్ల బలముతో మరల జన్మించిరి

అడవిబట్టిన రాము డంగన కై యేద్వ
పర్ణశాలను నిక్కి పరికించితిమి మేము
రుద్రుని వీర్యమ్ము భద్రమ్ముగా దాచి
కార్తికేయుని జన్మ కలిగించితిమి మేము

పసికందుగా ఏసు ప్రభువు మా పొత్తిళ్ల
పెరిగి లోకాలకు కరుణామృతము చిందె
మమ్ము మేసిన మహిషమ్ము సమవర్తికి
వాహనమ్మై సమవర్తనమ్మును నేర్పె
మముదిన్న గోమాత మధుర దుగ్ధములిచ్చె
మాపై తృణీకార మతమేలనో మీకు

గడ్డి చెప్పిన యీ సత్యం నా
గ్రుడ్డితనం మాన్పింది
కొడవలి నావైపు చూచి
కొంటెగా నవ్వింది
గడ్డికోయడం మాని
కాళ్లీడ్చుక వచ్చాను.

—

# పచ్చడి చేద్దాం

పచ్చడిచేద్దాం- ఉగాది
పచ్చడిచేద్దాం
పుచ్చిన యీ సంఘాన్ని
పచ్చడి చేద్దాం
అందరికి పసందైతే
అది చేదైనా తీపందాం

గోంగూర ఆకులైనా
గులాబీ రేకులైనా
పచ్చడిగా మారినవంటే
పరిశీలన కందవు అంతే

జిహ్వకొక రుచి
పుర్రెకొక బుద్ధి
ఎన్నాళ్లీ సిద్ధాంతం
ఈనాటితో అది అంతం

గుడిసెలేని ఒకదీనుడు
మిడిమెండను మాడుతుంటే
గుడిలేదని ఒక దేవుడు
బడా విరాళ మడుగుతుంటే

దీనునిలో దేవుని చూద్దాం
గుడిసెను గుడిగా మార్చుద్దాం

మడిలో ఒక బక్క రైతు
ఒడలు విరిచి పనిచేసి
పిడికెడు బువ్వకేడుస్తుంటే
బడిపేరున ఒక చదువరి
ప్రజలసొమ్ము వమ్ముచేసి
బస్సులు మంటపెడుతుంటే
మిస్సుల వెంటపడుతుంటే
చదువు "కొనడం" మాన్పిద్దాం
మడినే బడిగా మార్చుద్దాం

మిట్టపైకి తన రిక్షా
నెట్టలేని ఒక బికారి
చెమటపట్టి గసపెడుతుంటే
పెట్రోల్ ధర పెరిగిందని
పోట్లాడే ఒక షికారి
కారు జోరుగా నడుపుతుంటే
మనిషిని మరొక మనిషి మోసే
మహాపచారం తొలగిద్దాం
కారుకు రిక్షా తగిలిద్దాం

చట్టమనే మొసలినోట
పట్టుబడిన సామాన్యుడు
"లా" వాక్కింతయు లేదని
చావుకేక పెడుతుంటే
అలవైకుంఠ పురమ్ములోని
అధికార చక్రధరులు
రాజ్యాంగ సూత్రాలతో
రంగుల వల నేస్తుంటే
చట్టాలను తొలగిద్దాం- మనుషుల
కష్టాలకు విలువిద్దాం

భూమి దున్నే వాడిదే-
భూమిలేదు దున్నేందుకని
భూమన్నకు దిగులవుతుంటే
భూమిఉంది దున్నేటంత
భూమన్నలేడు దున్నేందుకని
భూస్వామికి సమస్యవస్తే
భూమికి స్వామి లేడందాం
భూమన్నకు పని కల్పిద్దాం

# ఇదీ నేటి జీవనం

ఏ తీరున అయితే నేం
ఏ పేరున అయితే నేం
ఎదుటి వాని చేతి సొమ్ము
ఎలా మనకు రావడం ?

ఇదీ నేటి జీవనం
ఇహపరైక సాధనం
నవనాగరకత చాటున
నడుస్తున్న నాటకం

తలపై శఠకోపముంచి
దక్షిణ కోరెను పూజారి
చట్టం చూపించి పన్ను
కట్టుమనెను అధికారి

కత్తిచూపి ఒంటి నగలు
ఎత్తుకుపోయె గజదొంగ
కడుపు చూపి ఆకలియని
కబళమడిగె భిక్షుకుడు

చదువుచెప్పి గురుదక్షిణ
సాధించెను గురువర్యుడు

సరకులు చెయిమార్చిధనం
జమచేసెను వ్యాపారి

అంగభంగిమలు చూపి
అర్థం లాగె సినీతార
నవసమాజ సంస్థాపనకై
చందాలడిగె నాయకుడు

కన్నె మెడను త్రాడుగట్టి
కట్నమడిగె పెండ్లికొడుకు
కవిత చదివి దుశ్శాలువ
కప్పమనియె కవిరాజు

# జగం మారిందా

యుగం మారినా
జగం మారిందా ?
పేరు మారినా - మనసు
తీరు మారిందా ?

అలభారత యుద్ధంలో
అంబులు విసరిన నరుడే
ప్రపంచ సంగ్రామంలో
బాంబులు విసరెను కాదా !

కొడుకు కోసం ధృతరాష్ట్రుడు
గ్రుడ్డివాడుగా మనలేదా ?
కొడుకులకై నేటి ప్రభులు
గ్రుడ్డిగా నడచుట లేదా !

పాండవులను చేరితే
పాంచాలి లభిస్తుందని
శ్రీకృష్ణుడే కర్ణుని
చెవిలో ఊదగలేదా ?
పక్షాలు మారితే
పదవీ కాంత లభిస్తుందని

శాసనసభ్యులు నేడు
ఆసనాలు మార్చుట లేదా ?

శల్యుడు కర్ణుని రథమెక్కి
సారథ్యం చేసిన దెందుకో
ఇంటనున్న బంటు నేడు
ఎదిరికి కనుగీటడ మందుకే

మయసభలో ఆనాడు
మణిమండపా లెందుకో
మహాసభలలో ఈనాడు
మహాడంబరాలందుకే

బకాసురునికి ఆనాడు
బండెడన్నం మనిషి ఎందుకో
ఏలిన వారికి ఈనాడు
ఎందుబోయినా విందు, మని + షి అందుకే



# ప్రాప్తి

పిండి ఆరబోసినట్లు
పండువెన్నెల విరిసినవేళ
మల్లెలు పరచాను త్రోవలో
అల్లన ప్రియురాలు నడచి వస్తుందని
ఎదురు చూచాను వేయికండ్లతో
ఎదలో చూపులో ఆత్మలో ఆమెను నింపుకోవాలని

కాల్క్రింద పూవు లీలగా తగిలిందోలేదో
రాలురప్పలీ కాలిబాట యని
వెళ్లిపోయింది ఆ మిటారి
వెనుదిరిగి చూడలేదొక్కసారి

కాటుక పులిమినట్లు
కారు చీకటి ముసిరిన వేళ
పల్లేరు ముళ్ళు పరచాను దారిలో
అల్లరిపిల్లకాళ్లు నెత్తురుమళ్లు కావాలని

వన్నెల చిన్నెల ఆ వగలాడికై
ఎన్నడు తపించలేదు నేను
గ్రుచ్చుకొన్న ముండ్లను
విచ్చిన పువు చెండ్లుగా భావించి
నన్నుచేర వచ్చింది
తిన్నగా ప్రియురాలు!

# మనిషిని మోసే మనిషి

పుట్టక ముందు నవమాసాలుమోసింది పుణ్యమూర్తి నీ మాతృమూర్తి
పుట్టింది మొదలు నిన్ను మోస్తున్నాడు పూర్తిగా రిక్షారాముడు
గిట్టిన తర్వాతనిన్ను చుట్టాలుమోస్తారోలేదో
గిట్టినా గిట్టకపోయినా ఇట్టే మోసేవాడు రిక్షారాముడు

అతనికళ్లు తిరుగుతున్నయ్ అతని రిక్షా చక్రాల్లాగే
అతని కండ లరుగుతున్నయ్ అతని రిక్షా టైర్లలాగే
అతనిమేను వర్షించే చెమట బొట్లు
ఆ లోకబాంధవుడు కార్చే కన్నీటి బొట్లు

అతని కళ్లు తిరిగి తిరిగి అతని కండలరిగి అరిగి
పడిపోతా డొకనాడు పట్టణరథ్యలో
బ్రహ్మరాక్షసి బస్సుచక్రాల మధ్యలో
అతణ్ణి మోసుక పోతాడు మరొక రిక్షారాముడు.

కాటికి, కళ్యాణవాటికి, వేశ్యావాటికి, త్రాగేచోటికి
ఎద్దులామోస్తున్నాడు ఎద్దుల్ని ఎద్దులాంటి మనుషుల్ని
మొద్దుగా మోస్తున్నాడు మొద్దుల్ని, ముద్దు గుమ్మల్ని

ఎద్దులా మనిషి బ్రదికే యీదేశం
మొద్దులా మనిషి నిలిచిన మనదేశం
ఎవరి కోసం ఏ గమ్యం కోసం ?

# భద్రాచల రామయ్యా

గోదావరి అదిగో నీ
గుడి చుట్టూ ప్రదక్షిణించె
మధురోదక ధారల నీ
మంగళపాదములు కడిగె

వామాంకమలంకరించె
భద్రముగా జనకపుత్రి
ఆయుధ సన్నద్ధుండై
అండనుండె సౌమిత్రి

ఎడమ చేత పెద్దవిల్లు
కుడిచేతను వాడితూపు
పట్టుకొన్న రామయ్యా!
భద్రాచల రామయ్యా!
ఎవరి మీద నీ బాణం
ఎక్కుపెట్టినావయ్యా!

లంకలోన ఆనాడొక
రావణు పరిమార్చినావు
కుంభకర్ణు నంత వాని
గుఱ్ఱు నిద్ర మాన్పినావు
ఇంద్రజిత్తు మాయలన్ని

వేలకొలది దశకంఠులు
వెలసిరయా ఈనాడు
భూకన్యను చెఱపట్టి
భోంచేయగ బూనినారు

కుంభకర్ణులై కొందరు
గుఱ్ఱు నిద్ర నున్నారు
ఇంద్రజిత్తులై కొందరు
ఇలను దోచుతున్నారు.

అందరు నీ గుడికి వచ్చి
అభిషేకం చేయువారె
ఎటులవీరి గుర్తింతువు
ఎపుడు తూపు విడిపింతువు.

ముసల్మాను తానాషా
ముక్తి బొంద జేసినావు
ముత్యాల తలంబ్రాలు
మ్రొక్కుబడిగ పొందినావు
రామదాసు అప్పుతీర్చి
బందిఖాన మాన్పినావు
ముస్లిం హిందువుల పేర
ముక్కలయ్యే దేశాన్ని
ఒక్కటిగా చేసేవా?

పరదేశపు అప్పులతో
బానిసైన దేశానికి
ఋణవిముక్తి కూర్చేవా ?

తండ్రిమాటకై అడవుల
దారిబట్టి పోయినావు
చాకివాని మాటకొరకు
సతిని కానకంపినావు

ఆస్తి కోసమై తండ్రిని
హతమార్చే నేటి సుతులు
న్యాయమూర్తి తీర్పులనే
ఆలింపని జననాధులు

కొబ్బరి కాయలతో నీ
గుడికి వచ్చి నిలిచినారు
భజనచేసి అలసిసొలసి
పారవశ్య మందినారు.

సెహబాస్ అని నీ వానర
సేనలతో జేర్చెదవో !
కరకుతూపు వ్రేటున ఆ
పరలోకము జేర్చెదవో !



**Dr. V. Malakonda Reddy**

.E., M.Sc., (Struct Engg.) Ph.D. (Edin).,
MIE (India), M A I H S (USA)

Born in Inimerla Village (1932)
Kanigiri Tq. Prakasam Dist. A.P.

Studied in Allur, Nellore Dist.
Nellore, Madras and Edinburgh,
Great Britain.

Participated in Freedom Moveme
as Secretary, Vidyarthi Congress,
Allur in 1947-49.

Published the following
Telugu Poems :

1. Netaji (1948)
2. Vivekanandudu (1953)
   (Prescribed as Text in Madra
   University in 1956)
3. Kanthi Chakralu(1959)

Worked as Civil Engineer P.W.D. Andhra Pradesh, (1955-5
Teaching Staff member of College of Engineering, Osman
University, Hyderabad (1957-61) and Regional Engineerir
College, Warangal (1961-79).

Present address : Principal Chaitanya Bharathi Institute
Technology, Gagan Mahal, Hyderabad-500 029, A. P.

Copies of
MOGALI REKULU

Can be had from :

Nandanam Publications,
Flat No. 102 B, Nandanam Apartments
5-8-42, Fateh Sultan Lane, Nampally,
Hyderabad-500 001. A.P. India.